## గంటల పంచాంగం

శ్రీజయ సంII ఆశ్వీయుజ శుII షష్ఠి 1954 సంII అక్టోబరు 3 ఆదివారం
అII షష్ఠి 20-21 జ్యేష్ఠ 23-4 వర్జ్యం లేదు.
శుII సప్తమి అక్టోబరు 4 సోమవారం
సోII సప్తమి.22-17 మూల రా1-28వర్జ్యం 7-52 ల 9-38 ష.


# ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యెు నరించిన పరవశ
యు(మియవు తవ నునంబున తగు ఆ
పౌరులకు వలిపేయిఉవికి వరాయువు
వరవుదర్కవతవు ంశెల్లవ్-(మహాభారతము

శ్రీ జయ సంII ఆశ్వీయుజ శుII షష్ఠి
ఆదివారం


## ఆంధ్ర మంత్రివర్గానికి అభినందనలు

ప్రస్తుతం అమలులో వున్న భూమిశిస్తు విధానాన్ని సంస్కరించాలని దేశ వ్యాప్తంగా, చాలా కాలంగా, ఆందోళన జరుగుతూవున్నది క్రిందటి పది పదిహేను సంవత్సరాల్లోనూ వ్యవసాయాదాయంపై పన్ను విధించాలని, భూమి శిస్తుపై సర్ ఛార్జి వసూలుచేయాలని, కొన్ని భూములపై అభివృద్ధి పన్ను వేయాలని రాష్ట్ర ప్రభుత్వాలు ఆలోచిస్తున్నవి ప్రత్యేక నిపుణులద్వారా వీటన్నింటిపై కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు విచారణలను కూడా జరిపించినవి. ఆ విచారణలను అనుసరించి పన్నులు విధించడానికి బిల్లులనుకూడా తయారు చేయడం జరిగింది.

కొత్త పన్నులన్నా అదనపు పన్నులన్నా ప్రజల్లో తీవ్రప్రాతికూల్యం ఏర్పడ్డం సహజం ప్రభుత్వ ప్రతిపాదనలవ కొన్ని ప్రత్యామ్నాయ ప్రతిపాదనలు వెలువడ్డంకూడా సహజమే అట్టి ప్రత్యామ్నాయ ప్రతిపాదనలలో ఒకటి గిట్టుబాటు కాని కమతాలను భూమిశిస్తు వసూలునుంచి మినహాయించాలన్నది ముఖ్యమైనది. వ్యవసాయాదాయంపై ఒకే విధమైన పన్నును విధించడానికి ఈ సంస్కరణ ప్రాతిపదిక కావాలి. భూమిపై గాక, భూమినుంచి వచ్చే ఆదాయంపై పన్ను విధించడమే సరియైన పద్ధతి. సంప్రదాయ సిద్ధమైనపద్ధతి ఈ పద్ధతి వల్లనే పంటదారులందరికీ వివక్షణ లేకుండా న్యాయం జరుగుతుంది.

ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం అనేక ఇతర విషయాల్లోవలెనే, భూమిశిస్తు విషయంలో నూ విప్లవాత్మకమైన సంస్కరణలను అమలు జరపడానికి నిశ్చయించింది. ఇందుకు ఆంధ్ర రైతాంగమే గాక దేశంలోని కర్షకులందరూ ఆంధ్ర మంత్రి వర్గాన్ని అభినందింపగలరు, పదియూపాయిలు, అంతకు తక్కువభూమి శిస్తును చెల్లించే రైతులు ఇకనుంచి భూమిపై పన్నును చెల్లింపనవసరం లేదని, భూమి శిస్తునుంచి పేద రైతులను మినహాయించడానికి ఆంధ్రమంత్రివర్గం నిశ్చయించిందని ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారు అక్టోబరు 1 వ తేదీన రాజధానిలో జరిగిన బహిరంగసభలో వెల్లడించారు. ప్రభుత్వం ఇందువల్ల ఎంత నష్టపడుతుందో తెలియదు. పేదరైతులకు పదిరూపాయలశిస్తు చెల్లింపు తగ్గినందువల్ల రైతులు పొందే ప్రయోజనమేమిటని ప్రశ్నించే వారుండకపోరు ఈ మినహాయింపు ప్రమాణాన్ని పదినుంచి పదిహేనుకో ఇరవైకో పెంచమని కోరేవారూ వుండకపోరు, రాష్ట్ర ప్రభుత్వం చేసిన నిర్ణయంలోని నైతికసూత్ర ప్రాధాన్యం ఈ ప్రత్యామ్నాయ ప్రతిపాదనలలో, సూచనలలో పడిపోయే ప్రమాదం మాత్రం ఏర్పడరాదు

వ్యవసాయాదాయంపై పన్ను విధించే సందర్భంలో ఈ పన్నునుండి మినహాయింప బడవలసిన ఆదాయ ప్రమాణాన్ని నిర్ణయించడానికిది ప్రాతిపదిక కావచ్చును ఈ మినహాయింపు సూత్రాన్ని రైతులకు వర్తింపచేసే సందర్భంలో ప్రభుత్వం పన్నుతోబాటు ఆదాయాన్ని కూడా విచారణలోకి తీసుకోకల్గితే భూమిశిస్తు సంస్కరణలను సులభంగా అమలు చేయవచ్చును వ్యవసాయంపై వచ్చే ఆదాయంలో మొదటి వెయ్యిరూపాయలనైనా మినహాయించడం న్యాయం సబబు అయితే నిరక్షరాస్యులైన రైతులు ఆదాయ వ్యయాలకు సంబంధించిన వివరాలను వ్రాసి ఉంచలేరు గనుక భూమిపన్నును బట్టిగాని, భూమివిస్తీర్ణమును బట్టిగాని ఈ మినహాయింపును వర్తింప చేయడం అవసరం వ్యవసాయ సరుకుల ధరలు తగ్గిపోతూవున్న సమయంలో ఆంధ్ర ప్రభుత్వం ఈ చర్య తీసుకున్నందుకు ప్రత్యేకం అభినందింపవలసియున్నది ఈ కొత్త సంస్కరణను అమలుజరిపే సందర్భంలో ఆహారధాన్యాలను పండించే రైతులను ప్రభుత్వం ప్రత్యేకం గమనించడం అవసరం. ఈ సంస్కరణల అమలు అనుభవంపై ఆంధ్ర మంత్రివర్గం భూమి పన్నుకు సంబంధించిన అన్ని అంశాలనూ విచారించి ద్వితీయవార్షికోత్సవంనాటికి ఈ సంస్కరణల సమగ్ర స్వరూపాన్ని నిర్ణయించగలదని ఆశిస్తున్నాము

పేదరైతులకు ఈ సదుపాయం కల్గించినట్లే వ్యవసాయ కూలీలకు బంజర్లను కేటాయించడం లోనూ, కనీస వేతనాలను నిర్ణయించడంలోనూ వీలైనంత శీఘ్రంగా చర్యలు తీసుకుంటే ఒక ప్రధాన సమస్య పరిష్కారమై పోగలదు.

### మురుగు పారుదల ప్రాజెక్టులు

రాష్ట్రావతరణకు కొద్ది రోజుల ముందు గోదావరి పొంగి తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల ప్రజలను విపరీతమైన నష్టానికి గురిచేసినది రాష్ట్ర తొలిజన్మ దినోత్సవాలకు ప్రజలు సన్నద్ధమౌతూ వుండగా కొన్ని ప్రాంతాలు కుంభవృష్టికి గురియై విపరీత నష్టానికి లోనైనవి. ఇప్పటి కింకా కోస్తా జిల్లాలకు వర్ష ప్రమాదం తప్పలేదు. గుంటూరుజిల్లాలోని మాగాణి తాలూకాలు, కృష్ణజిల్లాలోని కొంత ప్రాంతము ఈ విపరీత వర్షాలవల్ల నష్టపడినట్లు తెలుస్తున్నది నష్టమునకు సంబంధించి పూర్తి వివరాలింకా రావలసియున్నవి తెనాలి తాలూకాలో పసుపుతోటలు, వరిచేలు పూర్తిగా దెబ్బతిన్నట్లు, పండ్లతోటలు చాలావరకు నాశనమైనట్లు, క్రిందటి నాలుగైదు రోజులుగా వచ్చిన వార్తలు తెల్పుతున్నవి. రేపల్లె తాలూకాలో భాగనారు పూర్తిగా పోయింది యలమంచిలి తాలూకాలో చెరుకుపంటదారులు పైరు ఏమవుతుందో అని ఆందోళన చెందుతున్నారు బుడమేటి ముంపువల్ల విజయవాడలో దాదాపు రెండువేల మంది నిరాశ్రయులైనారు అటువిశాఖపట్నంనుంచి ఇటు గుంటూరు జిల్లావరకూ చాలా గ్రామాలు ఇటీవలి వర్షాలవల్ల బాగా నష్టపోయినట్లు ధృవపడుతున్నది.

రాష్ట్రంలో ఒక ప్రాంతాని కధికవృష్టి, మరొక ప్రాంతానికి అనావృష్టి ప్రమాదం ఎప్పుడూ వుంటున్నది ఈ ప్రమాదాలనుండి ఆ ప్రాంతాలను సంరక్షించడానికి, ప్రమాదాలేర్పడినప్పుడల్లా ప్రయత్నాలు జరుగుతూనే వున్నవి ఒక ప్రాంతంలో నీటి పారుదల సౌకర్యాలనుకల్పించాలి మరొక ప్రాంతంలో మురుగు పారుదలకు వీలు చేయాలి, కొత్త భూములకు నీరు అందచేయడానికి తీవ్రంగా ప్రయత్నాలు జరుగుతున్నవి పథకాలు తయారవుతున్నవి అవి ప్రణాళికలలో చేరుచున్నవి కొన్ని పథకాలు అమలు జగురుచున్నవి కూడా.

నీరు సమృద్ధిగా లభిస్తున్న ప్రాంతాల్లో మురుగు పారుదలకు వసతులు కల్పించడానికి మాత్రం చెప్పుకోతగిన కృషి జరగలేదు మంచి ఫలసాయాన్ని సాధించడానికి నాట్లకాలంలో, పైరయ్యే ఋతువులో పుష్కలంగా నీరుండడం ఎంత అవసరమో, పైరు కోతకువచ్చినప్పుడు పంట భూములలోని మురుగు నీరు పోవడానికి తగిన ఏర్పాట్లుండడమూ కూడా అంత అవసరం. కృష్ణా, పశ్చిమ గోదావరిజిల్లాలలో ఈమురుగు పారుదల దాదాపు ప్రతిరెండు మూడేండ్లకొకసారి తీవ్రసమస్యగా పరిణమిస్తున్నది కొల్లేరు, రొంపేరు, బుడమేరు ముంపు నివారణకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలని ప్రజలు ఎంతకాలంగానో ఆందోళన చేస్తున్నారు ప్రభుత్వం పరిశీలనను జరిపించి పథకాలను కూడా తయారు చేయించింది ఇంతవరకు ఏవీ అమలు జరగలేదు

నీటి పారుదల ప్రాజెక్టుల నిర్మాణం విషయంలో రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల అవసరాలను గుర్తించి ప్రాధాన్యక్రమమును నిర్ణయించే విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం, మురుగు పారుదల ప్రాజెక్టుల విషయంలోకూడా అంత శ్రద్ధ వహింపవలసిన సమయం వచ్చింది

ఇంతకు ముందు తయారై అమలుకు సిద్ధంగా వున్న మురుగుపారుదల ప్రాజెక్టులను వీలైనంత శీఘ్రంగా అమలుచేయడానికి రాష్ట్ర ప్రభుత్వం పూనుకోవాలి అప్పాపురం లాంటి ఇటీవల ఏర్పడిన ప్రాజెక్టుల క్రింద మురుగు పారుదలకు కల్పింపవలసిన సదుపాయాలను పరిశీలింపవలసి యుండును కాలహరణం లేకుండా రాష్ట్ర ప్రభుత్వం ఒక ప్రవీణుల సంఘాన్ని నియమించి ఈ పథకాలను పరిశీలింప చేయుగలదని ఆశిస్తున్నాము

### పెట్టుబడిసంస్థ

జైపూర్, అక్టోబరు 1 రాజస్థాన్‌లో త్వరలోనే ఒక పారిశ్రామిక పెట్టుబడిసంస్థ నెలకొల్పబడగలదని ముఖ్యమంత్రి జైనారాయణ వ్యాస్ ఇవాళ రాజస్థాన్ పారిశ్రామిక సలహాసంఘ సమావేశంలో వెల్లడించారు.

# ప్రపంచాన్ని సన్నిహిత పరిచే తపాలా బిళ్లలు

## శతవార్షికోత్సవాన్ని ప్రారంభిస్తూ ప్రధాని నెహ్రూ ప్రసంగం

న్యూఢిల్లీ, అక్టోబరు 1 తపాలా బిళ్ళలు ఏ విధంగా ఐకమత్యానికి దారితీస్తాయో వివరిస్తూ ప్రధాన మంత్రి నెహ్రూ ఇచ్చిన ప్రారంభోపన్యాసంతో నేడు తపాలా బిళ్ళల శతవార్షికోత్సవం ప్రారంభమైంది

ఈ సందర్భంలోనే ప్రధానమంత్రి అంతర్జాతీయ పోస్టేజి స్టాంపులు, పోస్టల ప్రదర్శనానికికూడాఅధికారికంగా ప్రారంభోత్సవం చేశారు

ప్రధాన మంత్రి ఆలోచిస్తూ ఈ ఉపన్యాసమిచ్చారు. ప్రారంభంలో ఆయన "వాన కురవని పిడుగుపడని, తుపాను రాని, మీకు మేము సేవ చేస్తాం" అన్న పోస్టల్ శాఖ ధర్మాన్ని గూర్చి మాట్లాడారు అనంతరం నవ్వుతూ" ఇప్పుడు దేశంలో వర్షమూ కురుస్తున్నది, పిడుగులు పడుతున్నాయి. మనం ఇక్కడ ఉపన్యాసాలు ఇస్తున్నాం అన్నారు. అంతాకూడా నవ్వారు.

ఢిల్లీలో ఈమధ్య శతవార్షికోత్సవాల జోరు ఎక్కువైంది. ఈ లెక్కన చూస్తే ఒక రోజున ఇక్కడ నాకు కూడా శతవార్షికం జరిగేట్లు వుంది అని ఆయన అనగా అంతా మళ్లీ నవ్వారు.

ఒకప్పుడు నేను కూడా ఈ స్టాంపులు ఇష్టం పోగుచేస్తూవుండేవాణ్ణి అవి నాదగ్గర ఇంకా వున్నాయి అయితే ఇది చాలాకాలం క్రిందటి సంగతి.

పోస్టల్ స్టాంపు వుండే అది దేశ చరిత్రకు చిహ్నం ఇట్లా ఈ వ్యవస్థ అనాదినుంచి అమలులో వుంది ఆ రోజుల్లో రాజులకు, అధ్యులకు మాత్రమే ఈ తపాలా సౌకర్యాలు వుండేవనుకుంటాను వారు ప్రతీహారులను ఉపయోగించుకొని, ఈ పనులను చేయించుకునేవాళ్లు, ఇప్పుడు అట్లా కాదు. పోస్టుసౌకర్యాలు ప్రతిఒక్కరి అందుబాటులోకి వచ్చాయి. ఈ పని ఇప్పుడు త్వరితంగా కూడా జరుగుతోంది ఇంకొంత కాలం పోతే "టెలిఫోట్" ద్వారా ఉత్తరాలు పంపించే రోజులు కూడా రావచ్చు. అప్పుడు ఇక ఈ ఉత్తరాలను ఒక చోటినుంచి ఒకచోటికి మోసుకు పోవలసిన అవసరం వుండదు.

పోస్టలు స్టాంపుల మూలంగా ఒక దేశంలో లక్షలాది ప్రజలు, ఇతర దేశాలకు చెందిన లక్షలాదీ ప్రజలు తన్ని హితులవుతున్నారు ,సన్నిహితులంటే, మరీ దగ్గరఅవుతున్నారనికాదనుకోండి. అట్లా ఇవి ఐకమత్యానికి తోడ్పడుతున్నాయి బహు దేశాలను ఇవి సన్నిహిత పరుస్తున్నాయి. ఇండియావంటి వైవిధ్య బహుళమైన దేశంలో వీటియొక్క ప్రాముఖ్యం మరీఎక్కువ.

నా చిన్నప్పుడు పోస్టుమేన్‌లు గంటల వాయించుకుంటూవచ్చి ఉత్తరాలు ఇచ్చిపోయే వాళ్లు, ఇప్పుడుకూడా కొన్నికొండల ప్రాంతాలలో ఈ పద్ధతి అమలులోవుంది. నిజం చెప్పాలంటే ఈ పోస్టల్ పద్ధతి ఇటువంటి పోస్టుమేనులు, ఇంకా ఎంతోమంది పనివాళ్ళ ప్రాణం.

ప్రజలకు ఈ ప్రదర్శనం నచ్చుతుందని, దీన్ని చూచి అంతా స్టాంపులు పోగుచేయడం ఆరంభిస్తారని అనుకుంటున్నాను అట్లాకాకపోతే, ఇక్కడ అమ్ముతున్న బొమ్మలపుస్తకం కొనండి, అందులో మా అందరిబొమ్మలు వున్నాయి, ఆ బొమ్మలను మీరు కత్తిరించుకోవచ్చు. పటాలు కట్టించుకోవచ్చు. అందుకు మా అభ్యంతరం ఏమీలేదు."

ఈ పండిత నెహ్రూ ఈ మాటలు చెప్పి కూర్చున్న తర్వాత రవాణాశాఖ డిప్యూటీమంత్రి శ్రీ రాజ్ బహదూర్ ఈ ప్రదర్శనంలో పాల్గొంటున్న అన్ని దేశాలవారికిధన్యవాదాలు చెప్పారు ప్రధాని ప్రదర్శనానికి ప్రారంభోత్సవంచేయమన్నారు ఈకోరడంలో ఆయన హిందీలో ఔపచారికంగా ఈ ప్రదర్శనాన్ని ప్రారంభించండి అని నెహ్రూను అర్థించారు ప్రధానినెహ్రూ ప్రదర్శనాన్ని ప్రారంభించి, "ఔపచారికం అంటే మీఅందరికి అర్థమైనట్లువుంది నాకు మాత్రం అర్థంకాలేదు నేను ఇంతవరకు ఎప్పుడు ఈమాట వినలేదు. అన్నారు "

సభ ప్రారంభంలో ప్రధానమంత్రికి స్వాగతంఇస్తూ తంతితపాలా మంత్రి శ్రీ జగ్జీవనరాం ఈ ప్రదర్శనంలో ఇన్ని దేశాలు పాల్గొనడానికి వచ్చాయంటే, భారత విదేశాంగ విధానం యొక్క జౌత్కృష్ట్యానికి ఇది ప్రథమ తార్కాణం అన్నారు ఈ ప్రదర్శనాన్ని చూచుఅందరికీ పోస్టల్ పద్ధతి పూర్వం ఎట్లా వుండేదో, ఇప్పుడు ఎట్లావుందో ముందు ఎట్లా వుంటుందో అర్థం అవుతుందని, పోస్టేజిస్టాంపు అల్లా ఉద్దీన్ లాంతరులాంటిదని, విద్యాభివృద్ధి, వర్తక వాణిజ్యాల వ్యాప్తికి మార్గంగా ఏర్పడిపోయిందని కూడా ఆయన అన్నారు

తంతి తపాలాశాఖ డైరెక్టరు జనరల్ హెచ్. ఎల్. జరత్ కూడా మాట్లాడారు ప్రదర్శనం ప్రారంభమైన తర్వాత ప్రధానమంత్రి లోపల అన్ని శాలలను దర్శించి వచ్చారు.

### బొంబాయిలో ప్రారంభోత్సవం

బొంబాయి, అక్టోబరు 1 భారతీయ తపాల బిళ్ళల శతవార్షికోత్సవాలను నేడిక్కడ జనరల్ పోస్టాఫీసువద్ద బొంబాయి మేయరు శ్రీ దయాభాయ్ పటేల్ ప్రారంభించారు ఈయన ముందు కొన్ని తపాల బిళ్లలను కొన్న తర్వాత వందలాది వుత్సాహవంతులు రకరకాల తపాల బిళ్ళలు, ఆల్బమ్‌లు కొన్నారు. అమెరికా, జపాన్, బ్రిటన్ దేశాలనుంచికూడ ఈ తపాల బిళ్ళలకు ఆర్డర్లు వచ్చాయి

తపాలశాఖ వుద్యోగులను, వార్తాహరులను, బొంబాయి మేయరు అభినందించారు తపాలశాఖ వుద్యోగుల విధులను వివరిస్తూ ప్రెసిడెన్సీ పోస్టుమాస్టరు చున్నీలాల్ ప్రసంగించారు.

## పేదరైతులకు భూమిశిస్తురద్దు

(1 వ పేజీ తరువాయి)

కావడం ఇష్టంలేని వాళ్లు కూడా మా అందరియెడలా అపరిమితమైన సానుభూతితోనే వున్నారు. గాంధీజీ నల హాలను మీరి పోని పద్ధతిలో మేము నడుచుకొని పోతున్నాం

తుంగభద్ర, కృష్ణ, గోదావరి, వంశధార అన్నిటినీ మా దృష్టిలో సమబుద్ధితోనే, పక్షపాతరహితంగానే ఉంచాలని కోరుతున్నాం ఈ సంజీవరెడ్డిని ఆ నదుల విషయం చూచుకొమ్మన్నాము. ఇప్పుడు రాయలసీమా లేదు కోస్తాసీమా లేదు. నదీ ప్రాజెక్టుల మూలంగా దేశంయొక్క రూపాకారాలే మారిపోతున్నాయి. కాని, అన్నిపనులూ ఒక్కమాటు చేయగలమా? చేయలేము. అందువల్ల ఒకటి తర్వాత ఒకటి చేస్తున్నాం.

మీదసాదల సేరుతో కొట్లాటలకు దిగే ఈ కమ్యూనిస్టులు మేము బీదలకు బంజర్లు పంచిపెట్టేవిషయంలోకూడ అది మానడంలేదు ఈ విషయమై తగవులాట ఉండరాదు. ఈ సమస్యపై విశ్వాసరాహిత్య తీర్మానం తెస్తామని వారంటున్నారు. ఎటూ ఇంకొక సంవత్సరంలోపల ఎన్నికలు జరగబోతున్నాయి.

చిన్న చిన్న భూఖండాలు పెట్టుకొని, శిస్తులు కట్టలేనివారెందరో ఉన్నారు ఈ కోటిరెడ్డి, ఆయన కార్యదర్శి శిస్తులు వసూలుచేస్తారు. ఎవరైనా కట్టకపోతే వారి ఆస్తిపాస్తులు వేలం వేస్తారు. చట్టనిబంధనల ప్రకారం వారం తక్కన్నా ఏమిచేయగలరు? శిస్తులు కట్టలేనివారు చాలామంది ఉన్నారు. వారికష్టాలు మాకు తెలుసు. వారినిమనం ఏమిచేద్దామా అని రెండు మూడు రోజుల నుంచి ఆలోచిస్తూవచ్చాము. పదిరూపాయలలోపు శిస్తులు చెల్లించేవారిని ఇకముందు ఆశిస్తు చెల్లింపునుంచి మినహాయించడానికి నిర్ణయించాము" (హర్షధ్వానాలు)

తర్వాత సంజీవరెడ్డిగారు మాట్లాడుతూ ఇలా చెప్పారు.- "ఇటువంటి సందర్భంలో చెప్పదగిందంతా పంతులుగారు చెప్పారు. ఇటువంటి ప్రకటనలు చేయడానికి అర్హతగలవారు పంతులుగారొక్కరే. చిన్న చిన్న రైతులనుంచి శిస్తులు వసూలుచేయడం సబబుగాదని కాంగ్రెసు ఆదినుంచీనే చెప్పతూ వచ్చింది. రైతుల్లోకూడా అన్ని తరగతులనుంచి ఒకేరేటున శిస్తు వసూలు చేయడంకూడ సబబుగాదు. కాని, ఇది బహుళంగా బీదలకే ఉంచకుండా కొంతమంది కమ్యూనిస్టులు సమస్యను పెంచేరు. ఈ భూములన్నింటిని పంచేస్తామని అనుకుంటున్నామంటే రాబడికి మునుపు వచ్చేమాట. అయినా పంతులుగారు ధైర్యం చేసి ఈ ప్రకటన చేశారు ఇకపైన చిన్న రైతులు శిస్తు చెల్లించక్కర లేదు. బీదలయెడ ఆదరాభిమానాలున్నట్లు చూపించుకొనే వారు నిజానికి ఆ బీదలకు ఏమీ సాయం చేయడంలేదు రైతుల పక్షం వహిస్తున్నట్లు చెప్పుకొనే కమ్యూనిస్టులు కూడ బీద రైతుల మధ్య కలహాలు కల్పిస్తున్నారు ఇంతగా చెప్పుకొనే ఈ పెద్ద మనుషుల్లో తీరావాస్తే ఆ బీదలకు ఒక్క ఎకరం భూమి ఇవ్వడానికి ముందుపడ్డవారొక్కరూ లేరు అయినా, బీదలకు బంజరు పంచడానికి మేము పూనుకొన్నప్పుడు మాత్రం ఈ కమ్యూనిస్టులు గ్రామాల్లో జగడాలు లేపుతున్నారు. జగడాలు లేపేటి అధికారం కోసం ప్రాకులాడడమే వారి పని లోటు బడ్జెట్టుతో మరెవ్వరూ చేయలేని పనిని ప్రకాశం ప్రభుత్వం చేసింది ఏదో విధంగా డబ్బు తెచ్చుకొని నిర్వహించుకొని వస్తున్నది మన ఆర్థిక మంత్రి ఒక మధురమైన మనిషి ఆయన లియ్యగా మాట్లాడతాడూ ఆర్థికంగా ఎప్పుడు అవసరం వచ్చినా ఆయన ఢిల్లీకి వెళ్లుతుంటాడు ఆయన కృషి ఫలించని వేళల్లో మేమంతా వెళ్లి ఏదో విధంగా డబ్బు సర్దుబాటు చేసుకొని వస్తుంటాము యీ ప్రణాళిక గడువులోపల 10, 12 కోట్ల ఋణం కేంద్రంనుంచి సాధింపగలిగాము మూడు కోట్ల లోటుతో మేము ప్రారంభించాము. పైసాలేనివాడికి ఎవ్వరిస్తారు? పంతులుగారు అందరికీ ఉత్సాహమిస్తుంటారు మేమంతా ఉత్సాహంతో పనిచేస్తాము ఇంత ధైర్యంగా పనులు నిర్వహించుకొని వస్తామని మేమెన్నడూ అనుకోలేదు పంతులుగారు మాఅందరికీ వెన్నుతట్టినవారు.

ఒక్క కర్నూలుజిల్లాలోనే కడప-కర్నూలు కాలువకైన మూడుకోట్లు ఖర్చుపెట్ట సమకట్టాము ఇంతేకాక, హైదరాబాదు ప్రభుత్వంవారి లాకోటిబండ ఆనకట్టలోకూడ వంతుకోసం ప్రయత్నిస్తున్నాము. ఈ సంవత్సరం ఎన్నో విద్యుచ్ఛక్తి ప్రణాళికలను పూనుకొన్నాం. రైతుకు సహాయం చేయడానికి కృషిచేస్తున్నాం ఇంకా ఎన్నో పథకాలు సాధింపగలమేమోం

మేము ఆరంభించిన అనేక మంచి కార్యక్రమాల్లో కొంతమంది అనవసరంగా చిక్కులు తెచ్చిపెడుతున్నారు అవిశ్వాసతీర్మానం తెద్దామను కొంటున్నారు. అది వారికొక పరిపాటి అయిపోయింది. మమ్మలను దించివేయడానికి కర్నూలులో ఒకసారి ప్రయత్నించి విఫలులయ్యారు విశాఖపట్నంలోనూ అంతే అయింది మళ్ళీ ఇప్పుడు మరోసారి ప్రయత్నిస్తున్నారు. ఏ క్షణమైనా బయటికి పోవడానికి సిద్ధంగా ఉన్నవారిని దింప యత్నించడంలో ప్రయోజనమేమిటి? మమ్మలను దింపివేసే ప్రయత్నంలో, మీరెన్నడూ నెగ్గలేరని నేను గట్టిగా చెప్పతున్నాను. ప్రకాశం మంత్రివర్గాన్ని దించివేసే రాజకీయవాదుల జట్టును ప్రజలెన్నటికీ సహించలేరు.

ఈ ప్రభుత్వానికి దేవుని అండ బాగానున్నది. రాష్ట్రసిద్ధి తర్వాత పంటలు చాలా బాగున్నాయి తమ పక్షాన దేవుడుగలవారిని ఎవ్వరూ పాని చేయలేరు"

విశాలాంధ్ర మహాసభ అధ్యక్షుడు కాశీశ్వరరావుగారు తర్వాత మాట్లాడుతూ, ఈ ప్రభుత్వం విచ్ఛిన్నమౌతున్నట్లు నిందారోపణ చేసిన బొంబాయి కాంగ్రెసు అధ్యక్షుడు యస్. కె. పాటిల్ గారు పొరపడ్డారని చెప్పారు ప్రకాశం ప్రభుత్వం బాగా పనిచేసిందని, క్రమేణా దృఢపడిపోతున్నారని చెప్పారు. త్వరలోనే విశాలాంధ్ర నిర్మాణం కాగలదని ఆశించారు.

మద్రాసు, అక్టోబరు 2: శ్రీ కొత్త రఘురామయ్య ఎం. పి. గారు ఈవాళ ఢిల్లీలో నుంచి విమానంలో మద్రాసు వచ్చారు

# కొత్తగా చదువు నేర్చుకున్న వయోజనులకు పుస్తకాలు

## 3 తెలుగుపుస్తకాలకు ప్రభుత్వబహుమతులు

న్యూఢిల్లీ, అక్టోబరు 1 దేశంలో కొత్తగా చదువునేర్చుకున్న వయోజనుల ఉపయోగార్థం వివిధభాషలలో రచియించబడిన పుస్తకాలలో 35 పుస్తకాలకు ప్రభుత్వం ఐదేసివందల రూపాయల బహుమతులు ప్రకటించింది వీటిలో మూడు తెలుగుపుస్తకాలకు ఈ బహుమతులు లభించాయి

కేంద్రప్రభుత్వ విద్యాశాఖ వారు గత జనవరిలో ఈ పోటీ ఏర్పాటు చేశారు.

ఇందులో ఈక్రింది మూడు తెలుగు పుస్తకాలకు ఐదేసివందల రూపాయల బహుమతులు లభించాయి.

1 గృహవిజ్ఞానము రచయిత్రి— శ్రీమతి కోడూరి లీలావతీదేవి గారు

2 అంటువ్యాధులు రచయిత-శ్రీ టి సుబ్రహ్మణ్యం గారు.

3. గృహాలంకరణ, ముగ్గులు—రచయిత శ్రీ జి. వెంకటేశ్వరరావు గారు.

ఇప్పుడు బహుమతులందుకున్న 35 పుస్తకాలలోనూ అత్యుత్తమమైన ఐదు పుస్తకాలకు తిరిగి మరి ఐదేసి వందల రూపాయలు బహూకరించడానికి ప్రభుత్వం నిశ్చయించింది బహుమతులనిర్ణయం జనవరి 26 వ తేదీన ప్రకటించబడుతుంది

ఈ పుస్తకాలలో కొన్నిటిని ఏయ్యే విప్రతులుగొప్పవ కమ్యూనిటీప్రాజెక్టు నిర్వాహకసంస్థవారు కొంటారు

ఈ పోటిలో ప్రకటించిన 35 పుస్తకాలలోనూ బహుమతులు ఈ క్రింది విధంగా ఉన్నవి.

తెలుగు 3 (పైన పేర్కొన్నవి), హిందీ 9 బెంగాలీ 3, గుజరాతీ 1, అస్సామీ 3, కన్నడం 2, మలయాళం 2, మరాఠీ 4, ఒరియా 1, పంజాబీ 1, తమిళం 4, ఉర్దూ 1.

# యూరప్ రక్షణకు నూతన పథకం

## లండన్‌సభలో ఫ్రాన్సుతిరస్కృతి

లండన్, అక్టోబరు 1, లండన్‌లో జరుగుతున్న 9 రాజ్యాల సమావేశం తిరిగి నేడు క్లిష్ట స్థితిలో పడిపోయింది యూరప్ రక్షణ కోసమున్నూ, జర్మనీనిపునరాయుధం చెయ్యడం కోసమున్నూ బ్రిటన్ తయారు చేసిన కొత్త పథకాన్ని ఫ్రెంచి ప్రధాన మంత్రి మెండీస్ ఫ్రాన్స్ తిరస్కరించి వేశారు

ఐరోపా ఆయుధభాండారం ఏర్పాటును గురించి నేను చేసిన ప్రతిపాదనకు మీరెవ్వరు ఖాతరు చెయ్యడంలేదు ఇప్పుడు మీరు తెచ్చిన పథకంలో నా పథకంలోవున్న అంశాలు ఏమీలేవు, దీన్ని నేను కుతిరమూ ఆమోదించను, అని ఆయన ఈ సభలో పాల్గొంటున్న తక్కిన ఎనిమిదిరాజ్యాలకు ఖచ్చితంగా చెప్పివేశారు

ఫ్రెంచి పథకానికి ప్రత్యామ్నాయంగా అమెరికా డల్లెస్, కెనడా పియర్సన్, బెల్జియం స్పాక్‌లు కొత్త ప్రతిపాదనలు చేశారు. వాటిని మెండీస్ ఫ్రాన్స్ తిరస్కరించారు.

బ్రిటన్ ఈడెన్ ముఖాన్ని కందగడ్డ చేసుకొని, తలమీద నెంట్రుకలు నిలబడగా, ఐరోపా రక్షణకు పరస్పరం విశ్వాసం ఆధారంగా వుండాలా? లేక పరస్పర విశ్వాసం ఆధారం కాకూలా అంటూ గట్టిగా ప్రశ్నించారు

ఈ ప్రశ్నకు సమాధానాన్ని మెండీస్ ఫ్రాన్స్ కూడా గట్టిగానే ఇచ్చారు. నాకు ఈ సభ, ఈ ప్రతిపాదనలు ఇవే ముఖ్యం కాదు. జర్మనీ అంటే మా దేశంలో అందరికీ భయం. అందువల్ల నా పార్లమెంటుకూడా అంగీకరించేవిధంగా ఈ పథకాలు వుండాలి అట్లా లేని పథకాలను నేను ఆమోదించను అన్నారు

దీనితో సభ సంక్షోభించిపోయింది. ఈడెన్ సభను వాయిదా వేశారు. ఈ రాత్రికన్నా మనకు జ్ఞానోదయం అవుతుందేమో చూద్దాం అని అన్నారు.

సభను ఇట్లా ముగించి ఈడెన్ ఫ్రెంచి ప్రధానితో కలిసి భోజనం చెయ్యడానికి లంకాస్టర్ భవనానికి వెళ్లారు. వీలుపడితే, ఆయన పట్టుదల సడలుతుందేమో చూద్దామని కూడా వెళ్లారు

కాని ఆ భవనంలోంచి బయటకు వస్తున్నప్పుడు ఈడెన్ చూస్తే, అంతా గందరగోళంగా వున్నట్లే వుంది. ఆయన చాలా ఆందోళన చెందుతున్నట్లు వున్నాడు. చెమటకూడా పట్టింది. మెండీస్ ఫ్రాన్స్ మాత్రం మామూలుగా నవ్వుతూనే వున్నాడు. బయటకు వచ్చినప్పుడు చుట్టూ చేరిన జనంతో పరాచికాలుకూడా ఆడాడు.

ఈ చిక్కు రాకపూర్వం అంతా మెండీస్ ఫ్రాన్స్ బెల్జియం రాజీ ప్రతిపాదనలకు ఆమోదించాడని అనుకున్నారు ఆయన ఆమోదించలేదని తెలిసిన తర్వాత డల్లెస్-పియర్సన్-స్పాక్‌లు వేరే ప్రతిపాదనలు చేశారు. వాటినికూడా ఆయన తిరస్కరించారు ఆయుధాల కంట్రోలు ఎట్లా వుంటుందో, ఇప్పుడే తేల్చాలి; ఎప్పుడో తేలుస్తామంటే లాభంలేదు అని ఆయన అన్నారు. అమెరికా, ఆదిగాగల దేశాలవారు తర్వాత ఆ కంట్రోలు పద్ధతులనుగూర్చి ఆలోచనలు చేయవచ్చునని అన్నారు. కాని అది సాగలేదు. ఇప్పుడుకూడా ఇంకా సాగుతుందేమోనన్న ఆశతోనే వని చేస్తున్నారు.

# ద్రవ్యనిధి చర్చల సరళి

## అమెరికా వైఖరికి అసంతృప్తి

### జపాన్‌పై ఈర్ష్య

వాషింగ్టన్, సెప్టెంబరు 30: స్టెర్లింగును, ఇంకా ఇంతర ద్రవ్యాలనూ, తేలిగ్గా డాలర్లలోకి మార్చుకొనే అవకాశం ఇప్పుడప్పుడే కల్గదు; "అంతర్జాతీయ ఆర్థిక వ్యవహారాలలో అమెరికా, ముందు నేను, అంతా తర్వాత" అన్న విధానాన్నే అనుసరిస్తుంది. జపానుపైకే వస్తూవుండటం పశ్చిమ రాజ్యాలకు కంటకప్రాయంగావుంది. ఈమూడుసత్యాలు ఇక్కడ జరిగిన ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సమావేశాల్లో బయటపడ్డాయి.

ఈ సమావేశాల్లో అమెరికా ప్రదర్శించిన వైఖరి చాలా రాజ్యాలకు అసంతృప్తిని కల్గించింది. అందువల్ల ఇక ఇప్పుడు బ్రిటిషు కామన్‌వెల్తు ఆర్థిక మంత్రులు సమావేశమై, తాము ఇక ముందు అనుసరించవలసిన పద్ధతినిగూర్చి త్వరలో చర్చలు జరుపుతుంటారని పరిశీలకులు అంటున్నారు

అమెరికాను, కామన్‌వెల్తు రాజ్యాలంటే, ప్రబోధమైన అనుమానం కల్గుతున్నట్లుగూడా ఈ సభల్లో వ్యక్తమైంది. బ్రిటిషు ఆర్థికమంత్రి సేమనల్ ప్రెస్‌క్లబ్బు విందులో మాట్లాడుతూ బ్రిటిషు ఖజానామంత్రి ఆర్. ఏ. బట్లర్ ఇట్టి అనుమానాన్ని పెంచుకుంటున్నందుకు అమెరికాను మందలించారు.

ఈ రాజ్యాలు తనలో గట్టిగా మైత్రి జరపక పోవచ్చునని తనమాట వినక పోవచ్చునని అమెరికా అనుమానిస్తున్నట్లు ఈయన ఉపన్యాసధోరణివల్ల వ్యక్తం అవుతున్నది అందువల్లనే ఈయన తన ఉపన్యాసంలో ఈ కామన్‌వెల్తు రాజ్యాలు రెండు యుద్ధాల్లో స్వతంత్రంకోసం పోరాడాయని సోపపత్తికంగా వాదించారు.

### పంచసూత్ర ప్రణాళిక

వాషింగ్టన్, సెప్టెంబరు 30. ప్రపంచబ్యాంకు సభలకు వచ్చిన కామన్‌వెల్తురాజ్యాల ప్రతినిధులందరు నేడు ఇక్కడ బ్రిటిష్ రాయబారి కార్యాలయం లైబ్రరీలో సమావేశమై, ఈ రాజ్యాల ఆర్థికశక్తిని ఇనుమడింపచేయడం ఎట్లాగో చర్చించారు

ఈ చర్చల్లో ఇండియా, పాకిస్తాన్, బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, దII ఆఫ్రికా, కెనడా, సింహాలాలు పాల్గొన్నాయి ఈ సమావేశంలో వీరు కామన్‌వెల్తు అభివృద్ధికి, తక్కిన కమ్యూనిస్టేతర రాజ్యాల అభివృద్ధికి గాను ఒక పంచసూత్ర ప్రణాళికను తయారు చేసినట్లు, ఆమోదించినట్లు అధికారవర్గాలవారు పేర్కొంటున్నారు

ఈ చర్చ నాల్గు గంటలపాటు జరిగింది.

ఈ నాల్గుగంటల చర్చల్లోను వీరు తేల్చిన ఈ కార్యక్రమంలో ఈ అంశాలు వున్నాయి (1) ఇంతవరకు సాధించిన అభివృద్ధిని ఈ రాజ్యాలన్నీ సమీకరించుకోవాలి అపరిమితంగా వున్న తమ సంపదలను అభివృద్ధిపరచుకోవాలి పనిష్ఠ ఆర్థిక సంక్షేమం వివిత్రం ద్రవ్యోల్బణాన్ని అరికట్టుకోవాలి. (2) బ్రిటన్, మొదలైన కొన్ని ఐరోపా దేశాలు యూరోపియన్ పేమెంట్ల సంఘం నెరసురకునుంచి బయటపడవచ్చి కొన్ని కొన్ని ఇతరదేశాల కరెన్సీలను డాలరలోకి మార్చుకొనే వీలును కల్గించాలి. (3) వర్తక వాణిజ్యాలకు ప్రోత్సాహం లభించేటట్లు అమెరికా తన మార్కెట్లను మరికొంత విశదం చెయ్యాలి (4) అంతర్జాతీయ ద్రవ్యనిధి పరపతిని విస్తృతపరం చెయ్యాలి (5) ప్రపంచవాణిజ్యాన్ని ఏ ...ంగా ... దాని ... అన్నారు ... పోటీ ఒప్పందాన్ని క్షుణ్ణంగా మార్చారు.

# నౌకాదళ విన్యాసాలు

## కొచ్చిన్‌కు నెహ్రూ ప్రయాణం

### బొంబైకి రాక

బొంబాయి, అక్టోబరు, 2: రేపటి నుండి అరేబియాసముద్రంలో భారత నౌకా, వైమానిక దళాలు నాలుగు రోజులపాటు జరిపే సంయుక్త విన్యాసాలకు ప్రధాని నెహ్రూ భారత నౌకాదళ పతాకనౌక 'ఢిల్లీ'లో ఉండి సందర్శిస్తారు. దానికోసం నే డాయన సపరివారంగా విమానంలో కొచ్చిన్‌కు పదుతూ, కొంతసేపు ఇక్కడ ఆగారు.

ఈ విన్యాసాల్లో ఢిల్లీ యుద్ధనౌక, రాజ్ పుత్, రంజిత్, రాణా, గోదావరి, గోమతి, గంగ అనే 6 డెస్ట్రాయర్లు, కృష్ణ, యమున తీర్ అనే 3 ఫ్రిగేట్లు, శక్తి అనే టాంకర్‌నౌక, అనేక విమానాలు పాల్గొంటవి.

ప్రధాని బృందంలో రక్షణమంత్రి సతీశ్‌చంద్ర, భారత నౌకాదళ కమొడోర్ అర్. డి. కటారి ప్రభృతులు ఉన్నారు.

# మద్రాసులోని కొన్ని ఆఫీసుల తరలింపు

[ఆంధ్రపత్రిక విలేఖరి]

గుంటూరు, అక్టోబరు 2. మద్రాసులోని ఆంధ్ర కేంద్రరోడ్డు రవాణా (ట్రాఫిక్) బోర్డు, జైళ్ల ఇన్‌స్పెక్టరు జెనరల్ కార్యాలయాలు ఇక్కడకు అక్టోబరు 10 వ తేదీనాటికి మద్రాసు నుండి తరలించబడతవి. ఈకార్యాలయాలు రెవిన్యూ బోర్డు భవనంలో, ఎల్. వి. అర్. అండ్ సన్సు క్లబ్ లో ఉంచబడినట్లు చెప్పబడుతోంది

# శ్రీ దాదాభాయి నౌరోజీ

## శ్రీ పండ్రంగి రాజేశ్వరరావు

**4-9-54** తేదీ భారత జాతీయోద్యమానికి పితామహుడు, భారత జాతికి ప్రపితామహుడు అగు శ్రీ దాదాభాయినౌరోజీయొక్క జన్మదినము. ఇట్టి శుభసమయంలో వారి జీవిత విశేషములను కొన్నింటిని కార్యకలాపములను స్మరించుట భారతీయుల విధ్యుక్తధర్మము. వీరు 1825 వ సంవత్సరము సెప్టెంబరు నాల్గవ తేదీని బొంబాయినగరంలో పారసీ పురోహిత కుటుంబమందు జన్మించిరి. ఈ సందర్భమున పార్శీలను గురించి కొంతవివరించుట ఉచితము. భారత దేశమందు వీరి జనసంఖ్య లక్షకు లోపించినను ప్రపథమునుండియు జాతీయ జీవితమందు విశిష్టమగు పాత్రను నిర్వహించుచూ వచ్చిరి. పర్షియా దేశముపై సుమారు పన్నెండు వందల సంవత్సరముల క్రితము మహమ్మదీయులు దండయాత్రను జరిపి జొరాష్ట్రియను మతమును, జాతీయ సంస్కృతిని సంఘ సంప్రదాయములను రూపుమాపుచుండగా కొంతమంది సనాతనులగు పారశీకులు కుటుంబములతో సహా భారతదేశమునకు వలసవచ్చి గుజరాతుప్రాంతమందు స్థిరపడిరి భారత దేశము అదినుండి సహనమునకు పుట్టినిల్లగుట చేత లోకడనే క్రైస్తవులు, యూదులు, మహమ్మదీయులు, మలబారునందు స్థిరపడిరి కొచ్చిను రాజ ప్రసాదమున క్రైస్తవుల యూదులకు నివేశన స్థలములనిచ్చిరి. వారి దేవాలయములకు యీనాములనిచ్చిరి. ఏసుక్రీస్తు శిష్యుడగు థామస్ ప్రచారఫలితముగ మతమును స్వీకరించిన కుటుంబములు నేటికిదక్షిణాదిని గలవు కేరళ రాజకుటుంబములోని రాజా ర్షుడను వ్యక్తి యొకడు ఇస్లామును స్వీకరించి మక్కాయాత్రకు వెళ్లినట అతడు తిరిగి వచ్చువరకు పాలించువారాతని ప్రతినిధులు మాత్రమే అను గాధ కలదు. కేలికట్టు (కోజికోడు) ప్రభువగు జామొరిను పట్టాభిషేక సమయమందు ముండనము చేయించుకొని మహమ్మదీయ నివలె టోపీని ధరించును. అపుడు ఈయనతో సమాన హోదాతో కూర్చొనెడి హక్కు అచటి మహమ్మదీయులగు మాప్లాలకే గలదు. అటులనే పార్శీలు తమ వ్యక్తిత్వమును కోల్పోక గుజరాతీలతో మిళితమైరి. గుజరాతీని మాతృభాషగా స్వీకరించి అమోఘమగు సారస్వత సేవచేసిరి. భారత దేశమందు భారీ ఎత్తున కీలక పరిశ్రమలను స్థాపించిన శ్రీ జమ్‌షెడ్ జీ టాటా, సకల ప్రపంచమునకు విజ్ఞాన కేంద్రముగరూపొందిన బ్రిటిషు రాయలు సొసైటీలో 1844 సంవత్సరము నాటికే సుప్రసిద్ధ ఇంజనీరు హోదాతో సభ్యత్వమును పొందిన కర్‌సెడ్ జీ ఇటీవల నే అట్టి గౌరవమును పొందిన శాస్త్రవేత్తయగు శ్రీ భాభా వ్యాయశాస్త్రమందు అసమాన పాండిత్యమును గడించి వివిధవిషయములను క్రోడీకరించిన, సర్ ఫర్ దున్‌జీ ముల్లా, అఖిల భారత జాతీయ మహాసభ కార్యకలాపములందు ప్రముఖ పాత్రను నిర్వహించిన, సర్ ఫిరోజిషా మెహాతా, సర్ ఎడల్జీ డిన్షా వాచా, శ్రీ కె యఫ్. నారిమను, ప్రఖ్యాత చలనచిత్ర పరిశ్రమను స్థాపించి, దాక్షిణ్యముతో నిర్వహించిన, మదన్, జవ్వలి మిల్లులను స్థాపించి వాణిజ్యములుగ పేరు ప్రఖ్యాతులు గడించిన శ్రీ నెసి టి వాడియా సర్ కొవాస్జీ జహాంగీర్, సర్ హోమీ మోడి, ప్రభృతులు పార్శీ సంఘమునకు చెందినవారే, వీరి దేశభక్తి, సేవాశక్తి నిరుపమానమైనది. కొంతకాలము క్రితము సా ప్రభువు వీరిని పర్షియాకు తిరిగి వచ్చి ఆదేశపు పురోభివృద్ధికి తోటుపడమని ఆహ్వానించినపుడు వీరు తిరస్కరించిరి భారత జాతీయ త్రివర్ణ పతాకమును యాభైతాబ్ది మొదట రోజులలో జర్మను ప్రజాతంత్రవాదుల సమక్షమున ప్రప్రథమంగా ఆవిష్కరించే గౌరవము మేడమ్ కామా అనే పార్శీ యువతికి దక్కినది.

దాదాభాయికి చిన్న తనమందే తండ్రిగతించెను. వీరిది మధ్యతరగతి సామాన్య కుటుంబము. ఈయనకు గల మాతృభక్తి అపారము. తల్లియొక్క చెప్పుచేతలలో పెరిగెను. ఎన్నడూ తల్లి మాటను జవదాటి ఎరుగడు ఎవరైనను తన యెడ పరుష వాక్యములు పలికిన "నీ పరుష వాక్యములు నీ నోటయుంచే యుండు" అని చమత్కరించువాడు. 15 సంవత్సరముల యువకుడుగనుండగనే యీయనలో ఒక్క టి మార్పు వచ్చెను. రాత్రి భోజనముకు ముందు కొంచెము మద్యమును త్రాగుట పార్శీలకు అలవాటు ఒక నాటి సాయంకాలము యింటిలో మద్యము లేక పోయెను. అంతట ఆయన తల్లి వీధి చివరనున్న పానశాలకు పోయి త్రాగి రమ్మనెను. అచట గల త్రాగుబోతుల దృశ్యమును చూచిన పిదప కలిగిన ఏహ్యభావము వలన అంతటి నుంచి దాదాభాయి అజన్మాంతము మద్యమును ముట్టలేదు విద్యార్థిగ నుండగనే ప్రతిభావంతుడను పేరును సంపాదించెను. విద్యార్థి వేతనముతో చదువును ముగించెను బీదలిచ్చెడి పన్నులవల్ల వారికి లేని సౌకర్యములను తాను పొందితినని వాపోవు చుండెడి వాడు. ఉన్నత విద్యకై 1845వ సంవత్సరమందు ఇంగ్లాండు వెళ్లు అవకాశము యీయనకు కల్గినను మత భ్రష్టుడగునని తల్లి శంకించుట చేత ఆ అవకాశమును త్రోసిపుచ్చెను. బొంబాయి యందలి ఎలిఫిన్‌స్టను కళాశాల యందు చదువును పూర్తిచేసి అచటనే గణిత శాస్త్రమును తత్వశాస్త్రమును బోధించు అధ్యాపకుడుగ కొంతకాలము పని చేసెను.

ఈయన 1845వ సంవత్సరము మొదలు 1855వ సంవత్సరము వరకు బొంబాయియందుండిరి అపుడు ప్రిన్సిపలు పేటను సహాయముతో విద్యార్థుల కొరకు విజ్ఞాన సమితిని స్థాపించెను ప్రజాభిప్రాయము తనకు వ్యతిరేకముగనున్నను ధైర్య స్థైర్యములతో మహిళలకు నన్నత పాఠశాలను స్థాపించెను. ప్రజాభిప్రాయమును విపులీకరించుటకు బొంబాయి సంఘమును ఏర్పాటు చేసెను వితంతు వివాహములను ప్రోత్సహించుటకొక సంఘమును నెలకొల్పెను. విక్టోరియా- ఆల్బర్టు చిత్రవస్తు ప్రదర్శనశాలను స్థాపించు గౌరవము కూడ యీయనకే దక్కెను 1851వ సంవత్సరమందు (యథార్థవాది) అను పత్రికను స్థాపించి ఇండియను సివిలు సర్వీసు పరీక్షకు వెళ్లెడు అభ్యర్థుల వయస్సును హెచ్చించవలెనని ఆందోళన చేసిరి

1855వ సంవత్సరమందు శ్రీ కుంటు లు ప్రముఖ వర్తకులు అగు కామా కుటుంబమువారి లండను శాఖను నిర్వహించుటకు ఇంగ్లండు వెళ్లిరి. అచట యీయన ధనార్జనతో తృప్తి పడలేదు భారత జాతీయ మహాసభ తొలి అధ్యక్షుడుగ చరితార్థుడైన శ్రీ ఉమేశ చంద్ర బెనర్జీ సహాయ సానుభూతులతో ఇంగ్లండులో ఇండియా సంఘమును స్థాపించెను. ఆ సంఘమును నడుపుటకు భారత సంస్థానాధీశ్వరుల వద్దనుండి ప్రజలవద్ద నుండి విరాళములను సేకరించిరి. ఇంగ్లీషు పత్రికలకు భారత సమస్యలను గురించి తరుచు వ్యాసములను వ్రాయుటయే గాక దేశమందంతటను సంచారము చేసి ఉపన్యసించి ఆంగ్లేయుల దృష్టిని భారత సమస్యవైపు త్రిప్పిరి.

1866 వ సంవత్సరము నుండి కామా కుటుంబముతో విడిపడి వీరు స్వయముగ వ్యాపారమును సాగించిరి. ఒక హిందూ స్నేహితుని అప్పులకు హామీయుండి యుంచుమించుగ తాను దివాళాతీయుస్థితికి వచ్చెను. కాని తనయొక్క మంచితనము వలన మాట ఘరానావలన పరిస్థితులు క్రమేపీ చక్కబడెను. ఆ సంవత్సరమే బొంబాయి కౌన్సిలు నందు సభ్యత్వమును పొందినను బ్రిటిషు పార్లమెంటుకు సభ్యుడుగ ఎన్నికలలో నిలచుటకు ఇంగ్లండు వెళ్లిరి కాని అపుడు ఓడిపోయిరి 1869వ సంవత్సరమందు బొంబాయికి తిరిగి వచ్చినపుడు పౌరులీయనను సన్మానించి కొంతనిధినిచ్చి సత్కరించిరి. కాని ఆయన అందలి ఒక్క పైసనైనను ముట్టుకొనక యావత్తు మొత్తమును ప్రజాహిత కార్యములకుపయోగించెను. తరుపరి బ్రిటిషు పార్లమెంటువారు భారత ఆర్థిక విషయములను గురించి విచారించుటకు నియమించిన ఫ్యాకెట్టు కమిటీ ఎదుటసాక్ష్యమిచ్చిరి. అపుడేయీయన లెక్కకటి భారతీయునకు సగటున సాలుకువచ్చు అదాయము ఇరువదిఏడు రూపాయలు మాత్రమేనని సిద్ధాంతీకరించిరి. భారత సంస్థానాధీశులలో ముందంజవేయుటలో ప్రథమ శ్రేణికి చెందిన గాయక్వారు ఆహ్వానముపై బరోడాసంస్థానమునకు 1874 వ సంవత్సరమందు దివానుగ వెళ్లిరి. అచట బ్రిటిషు రెసిడెంటుయొక్కయు లంచగొండులగు అధికారుల యొక్కయు వ్యతిరేకతను లెక్కచేయక సంస్థాన పరిపాలనను చక్కబరచి పురోగమింప చేసిరి

లిట్టను ప్రభువు రాజప్రతినిధిగనున్నపుడీయన హితవుపదేశ ఊనము వహించెను తదుపరి సహృదయుడగు రిప్పన్ ప్రభువు రాగనే పరిస్థితులు బాగుపడెను 1885 వ సంవత్సరమునందు శ్రీ అల్లను అక్టేవియన్ హ్యూమ్, సర్ హెన్రీ కాటన్, శ్రీ వెడ్డర్ బర్న్, శ్రీ ఆండ్రూ యూల్ ప్రభృతుల సహాయ సానుభూతులతో భారత జాతీయమహాసభ ఏర్పడెను 1886 వ సంవత్సరమందు కలకత్తాలో జరిగిన ద్వితీయ వార్షిక సమావేశమునకు శ్రీ దాదాభాయి నౌరోజీ అధ్యక్షత వహించెను. ఈయనయొక్క గంభీరోపన్యాసము శ్రోతల నాకర్షించెను. తిరిగి ఇంగ్లండు వెళ్లి 1892 వ సంవత్సరములో జరిగిన సాధారణపు ఎన్నికలలో లిబరలుపార్టీ అభ్యర్థిగ గెలిచి పార్లమెంటు సభ్యుడయ్యెను. ఇట్టి గౌరవము పొందిన ప్రథమ భారతీయులు వీరె. తదుపరి కన్సర్వేటివుపార్టీ తరఫున సభ్యులైన శ్రీమాంచెర్జీ భువనగిరి, కమ్యూనిస్టుపార్టీ తరఫున సభ్యులైన శ్రీ సాపూర్జీ సక్లత్ వాలా కూడ పార్శీ సంఘమునకు చెందిన భారతీయులే. ప్రథమ ప్రపంచయుద్ధసమయమందు సామ్రాజ్య యుద్ధమంత్రివర్గ సభ్యులుగా పనిచేసిన రాజ్యతంత్ర ప్రవీణుడు న్యాయశాస్త్రకోవిదుడు అగు శ్రీ సత్యేంద్ర ప్రసాద సింహా మాత్రము భారత ఉపకార్యదర్శి హోదాలో పార్లమెంటు ప్రభువులసభలో సభ్యత్వము పొందెను. దాదాభాయి చేసిన కృషి ఫలితముగా భారత సమస్యలను పరిశీలించుట కొరకు కమిటీని స్థాపించిరి. 1893 వ సంవత్సరమందు తన ఏకైక పుత్రుని మరణమువల్ల కలిగిన దుఃఖమును సహితము దిగమ్రింగి లాహోరునందు జరిగిన తొమ్మిదవ జాతీయమహాసభ సమావేశమున అధ్యక్షత వహించుటకు స్వదేశమునకు తిరిగి వచ్చిరి. భారతభూమిమీద అడుగుపెట్టినది మొదలు లాహోరు చేరువరకు ప్రజానీకము తండోపతండములుగవచ్చి వీరికి త్రోవపొడుగున అఖండమగు స్వాగతము నిచ్చిరి. జయజయ ధ్వానములు మిన్నుముట్టెను అట్టి హృదయపూర్వకమగు స్వాగతము చక్రవర్తులకు ప్రధానులకుకూడ అందుబాటులో నుండదనుట సత్యదూరముకాదు లాహోరు నగరమందు బ్రహ్మరథము పట్టిరి. అధ్యక్షుకటమునకు కట్టిన గుర్రములను విప్పివేసి ప్రజానీకము హర్షధ్వానములు చేయుచు భజాభజలివరకు వారిబండిని లాగుకొనిపోయిరి

తదుపరి భారతదేశమందలి ఖర్చులను గురించి విచారించుటకు వెల్బిసంఘమును వియమించుటకు కృషిచేసిరి 1898 వ సంవత్సరమందు నియమింపబడిన కర్జెన్ని కమిటీ ఎదుట వాఙ్మూలము నిచ్చిరి. ఎనుబదేండ్లునిండి పండు ముదుసలిఅయిన పిదపకూడ 1905 వ సంవత్సరమందు ఆమ్‌స్టర్‌డామ్ నగరములో జరిగిన అంతర్జాతీయ సోషల్ డెమాక్రటిక్ మహాసభకువెళ్లి ఇండియాలోని బ్రిటిషుపాలనను తీవ్రముగ విమర్శించిరి. అంతకుపూర్వమే యీయన లోగడ రచించిన "బ్రిటిషువారి దుష్పరిపాలన, దారిద్ర్యము" అను గ్రంథము ప్రజాతంత్రవాదుల దృష్టినాకర్షించెను. ఈయన వ్యక్తపరచిన అంతర్జాతీయదృక్పథం భారతసంస్కృతి సంస్కారములకు సాంప్రదాయములకు గీటురాయిఐయున "ఉదార చరితా నాంతు వసుధైవ కుటుంబకమ్" అనెడు స్మృతివాక్యమునకనుగుణముగనున్నదనుటలో సంశయములేదు

హిందూదేశములోని అతివాద మితవాద నాయకుల నడుమగల అభిప్రాయభేదములు తీవ్రరూపము నొందజొచ్చెను 1901 వ సంవత్సరమందు మితవాదుల అధ్వర్యముక్రింద శ్రీ దిన్షా ఎడల్జీ వాచాగారి అధ్యక్షతనుజరిగిన కలకత్తా కాంగ్రెసు నాటికే అతివాద నాయకులగు లోకమాన్య బాలగంగాధర తిలక్ కపర్ది, శిశిర్ కుమార్ ఘోష్ ప్రభృతులు ఒకకూటముగ పనిచేయ ప్రారంభించిరి. 1905 వ సంవత్సరమందు శ్రీ గోపాలకృష్ణ గోఖలే అధ్యక్షతను కాశీలో జరిగిన కాంగ్రెసునాటికి పరిస్థితులు ప్రకోపించి రాగయుక్తపడినవి పంజాబుకేసరి లాలా లజపతిరాయి, కస్తూరి రంగయ్యంగారు (హిందూ సంపాదకులు) బిపినచంద్రపాలు తిలక్ మహాశయున కండగ నిల్చిరి. తొలుదొలుత గోఖలే ప్రతిపక్ష నాయకుడగు తిలక్‌ను వినయముగ వేడుకొని రసాభాసము కాకుండ సభాకార్యక్రమంబును నిర్వహించెను. మరుసటి సంవత్సరపు కాంగ్రెసుకు అధ్యక్షత వహించుట కుభయవర్గములకు అంగీకృతుడగు వ్యక్తి కావలసియుండెను దాదాభాయినౌరోజీ సహజముగ అందరి దృష్టిని ఆకర్షించెను వీరు ప్రప్రథమమునుండి వర్గకక్షల కతీతముగనుండుటవారు అందరిదృష్టిలోను యీయన సమవర్తి, అజాతశత్రువు. ఉభయవర్గముల దృక్పథములను సమన్వయ పరచగల శక్తిని కల్గియుండిరి, అందరకు ఆయన ఎడ గురుభావముండెడిది. స్వతహాయాపని. చిరునవ్వు నవ్వి పిదప మాట్లాడువాడు. ఇది ఆర్యలక్షణము శ్రీరామచంద్రుడు "స్మితపూర్వభాషి" అని ఆదికవి వాల్మీకి మహర్షి వర్ణించియున్నాడు అంతమాత్రమున కులువుగ లొంగువారుకారు రామాయణమందు చెప్పిన "మృదుశ్చ, స్థిరచిత్తశ్చ" యిత్యాది గుణగణములు యీయనలో మూర్తీభవించిన వనుటలో అతిశయోక్తి లేదు మితవాదుల దూరదృష్టిని, వివేకమును, పాండిత్య ప్రకర్షను వీరు హర్షించినను, అతివాదుల చిత్తశుద్ధి ఉత్సాహము, త్యాగము వీరి హృదయమును ద్రవింపజేసెడివి. ఆలోచన మితవాదుల వైపు మ్రొగినను, హృదయము అతివాదుల నాశ్రయించెడిది. ఆ కారణమున కీయన అతివాది వదనములోనున్న మితవాదియూ, లేక మితవాది వదనములోనున్న అతివాదియూ అను సంశయము చాలమందికి కల్గెడిది చాలను మాత్రమే త్రాగి నీటిని విడిచిపెట్టు హంసవలె యీయన ప్రతివిషయమందును గల మంచిని మాత్రమే స్వీకరించువారు అన్ని వర్గముల దృష్టిలోను యీయన మహాభారతములో చెప్పబడినట్లు "హితుడు, మతిమంతుడు, చతుర వచనకోవిదుడు, సమయజ్ఞుడు, ఉన్నత వంశవర్ధనుడు, ఇంగితవేది, సచ్చీలి"

అందుచేత 1906 వ సంవత్సరమందు కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభ వీరి అధ్యక్షతక్రింద జయప్రదముగ జరిగెను. అంతవరకు కాంగ్రెసు అధ్యక్షతను మూడుసార్లు చేపట్టిన గౌరవము ఎవ్వరకు దక్కియుండలేదు ఇట్టి అపూర్వ గౌరవము వీరికి దక్కులు పడుటలో ఆశ్చర్యములేదు. వీరందులకు అర్హులనుట నిర్వివాదాంశము స్వరాజ్యమే భారతీయుల పరమావధి అని అధ్యక్షపీఠమునుండి శంఖారావము చేసిరి ఆర్యసమాజ సంస్థాపకులైన శ్రీ దయానంద సరస్వతిస్వామి ప్రప్రథమముగ 'స్వరాజ్య' పదమును నిర్వచనము చేసిరి స్వరాజ్యము తన జన్మహక్కని లోకమాన్యతిలక్ ఉద్ఘాటించెను దీనికి దాదాభాయి కాంగ్రెసు ముద్రవేసిరి హర్షధ్వానములతో సభాస్థలి పిక్కటిల్లెను. బ్రిటిషు పాలకుల హృదయములో రాయివడిన ట్లయ్యెను. 81 సంవత్సరములు నిండిన ముదుసలి యైనను ప్రజాభిప్రాయమును అవగాహన చేసుకొని తదనుగుణముగ ప్రవర్తించెను. కాలమాన పరిస్థితులను గుర్తించుటయే ధీమంతుల లక్షణము అంతటి నుంచి వీరిని భారతజాతీయోద్యమమునకు పితామహుడని కాక భారతజాతికి ప్రపితామహులని భారతీయులందరు ముక్తకంఠముతో ప్రస్తుతించిరి.

యువకులుగా నున్నపుడు అతివాదులుగ చలామణిఅయి, క్రమేపి మితవాదులుగ మారి తదుపరి రాజభక్తులుగ రూపొందినవారు పెక్కుమంది కలరు. కాని దాదాభాయి మాత్రము చివరవరకును అసలైన భారతీయుడుగను నిసలైన జాతీయవాదిగను ఉండెను వీరి చర్య లన్నిటియందును జాతీయభావ ముట్టిపడెడిది. ఇంగ్లండునందున్నంతకాలము ఆంగ్లేయుల దుస్తులను ధరించినను, గౌరవదేశమందు దిగిన సనాతన పార్శీజాతీయ దుస్తులను ధరించువారు తెలిగావుసోపానములందరు జాతీయ దుస్తులుగ రూపొందినప్పటికి కలదు వీరి నామధేయమందే వీరి జీవితము ప్రతిబింబించి యున్నదనుటలో అతిశయోక్తిలేదు దాదా అనగా పిల్పు సమూహము, భాయి అనగా కష్టము నుండి నోచుకొను... నరోజీ అనగా పార్శీల సంవత్సరాది పండుగ భారత జాతీయ స్వాతంత్ర్యమహోదయమునకు వీరు ప్రవేశికలు. వీరు తమ 92 వ ఏట 1917 వ సంవత్సరము జానువరి 30 వ తేదీని బొంబాయిలో పరమపదించిరి అపుడు భారతదేశమందేకాక, బ్రిటనులో కూడ స్మారక సభలు జరిపిరి. వీరు సకల విధముల సవ్యజీవులు, పురాణపురుషులు వీరి చిత్తశుద్ధి, నిరాడంబరత్వము, ఉన్నతాశయములు, కార్యదీక్ష తరతరములకు అనుసరణీయము. వీరి పవిత్ర స్మృతిని భక్తిశ్రద్ధలతో స్మరించి వారు హోల్లోనర్పుటభారతీయుల కనీస ధర్మము.

(ఆల్ ఇండియా రేడియో విజయవాడ కేంద్రంవారి సౌజన్యంతో)



# సత్యరహిత విశాలాంధ్రనిర్మాణమే ఆంధ్రుల ఏకైక వాంఛ

## శ్రీ తవ్మా రంగారెడ్డి

చిరకాల వాంఛితమైన నూతన ఆంధ్ర రాష్ట్రము అవతరించినది సర్వజన సమాదరణీయులగు ఆంధ్రకేసరి ప్రకాశం, సంజీవరెడ్డిగారల నాయకత్వము లభించుట సంతోషవహము. సుస్థిరమైన మంత్రి వర్గమేర్పడుట ఆంధ్ర నాయకుల దూరదృష్టికి తార్కాణము. ఆంధ్రరాష్ట్రముయొక్క వ్యవస్థ భాషా ప్రాతిపదికములపైన జయప్రదముగా కొనసాగుట ఇతర భాషారాష్ట్ర నిర్మాణములకు మార్గదర్శకముగా నుండగలదు.

ఆంధ్రదేశ నగరాలలో అన్నిటికన్న రమణీయమై, విశాలమైనది హైదరాబాదు. మూడున్నర శతాబ్దములకు పూర్వము భాగ్య నగరమును పేరుతో యీ పట్టణమును గోల్కొండ సుల్తానులు ఆంధ్రచక్రవర్తులైన కుతుబ్‌షాహి వంశీయులు నిర్మించిరి నిజముగా అది భాగ్య నగరమే నిర్మింపబడినప్పటినుండి తెలుగుసీమ, వివిధ భాగములలో విభజింపబడు సంతవరకు యావదాంధ్ర దేశమునకు రాజధానియైన భాగ్య నగరము ఇంకను తెలంగాణమునకు రాజధానిగా నుండుట విచారము. ఇక్కడి పురాతనమైన ఆంధ్రజాతి సౌలభ్యవంతమైన, ఉత్కృష్ణమయ కొంతమై, ఒప్పుచున్నది. ఏక నాగరికత, సంస్కృతి, ఆర్థిక పరిస్థితి, సాంఘిక మతాచారములను, సాంప్రదాయములను కలిగిన ఆంధ్రులు నివసించు భూభాగము 1,29,000 చ మైళ్లు

ప్రస్తుతము ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రము సమగ్రమైనది కాదని అందరికీ తెలిసిన విషయమే. తెలంగాణములోని హైదరాబాదు, మహబూబు నగరము, నల్లగొండ, ఖమ్మం, వరంగల్లు, కరీంనగరము, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదకు, జిల్లాలు విడిగా నున్నంతకాలము సంపూర్ణమైన ఆంధ్ర రాష్ట్రము కాజాలదు. విశాలాంధ్ర ఉద్యమమును జయప్రదముగా చేయుటకు మనమందరము యింకను అన్యోన్య ప్రేమతో కృషి సల్పవలసిన అవసరము కలదు ఉత్తరాది సర్కారులను, దత్త మండలములను, ... కృష్ణా ... ఏర్పడిన నాటి రాష్ట్రముగా కొంది... వాటిని తెలంగాణముతో సమైక్యపరచి, సంపూర్ణమైన ఆంధ్ర రాష్ట్రము నేర్పరుచు విషయములో తేదాభిప్రాయము లుండగూడదు ఉండబోవు. భాషా ప్రయుక్త రాష్ట్ర తత్త్వమును అంగీకరించిన కేంద్ర ప్రభుత్వమునకు కూడా వ్యతిరేక భావము కలుగబోదు. ప్రాంతీయ భేదములను లక్ష్యమందుంచుకొనక మన మందరము విశాలాంధ్రోద్యమమునకు దోహద మొసంగ వలయును.

### తెలంగాణా విశేషములు

జనసంఖ్యబలమును, వైశాల్యమును, విస్తీర్ణతను దృష్టియందు ఉంచుకొనియు, భూగోళపరిస్థితి ననుసరించియు, ఆంధ్రరాష్ట్రములో తెలంగాణము లీనమయినప్పుడె, సకలాంధ్ర భవిష్యత్తు కాంతివంతమయి, స్వయంపోషకమయి, ఆంధ్రరాష్ట్రము శోభాయమానమగును తెలంగాణములోని జలాశయములు, ఖనిజసంపద, వృక్షసంపద, మున్నగు నైసర్గిక భాగ్యముతోబాటు ముడిపదార్థముల ఉత్పత్తి, పారిశ్రామిక సాధనములు, కర్మాగారములు ఆంధ్రులభావి భాగ్యోదయమునకు హేతుభూతమగును హైదరాబాదు సికిందరాబాదు పట్టణములు ఏకమయి, ఆంధ్రరాష్ట్రమునకు సుశోభితమైన రాజధానిగా ఉపకరించగలవు అచ్చటి సుందరమైన భవనములు, వర్తకవ్యాపారములు, వైజ్ఞానిక సంస్థలు, చారిత్రక ప్రదేశములు, పుణ్యక్షేత్రములు నిరుపమానములయి సకలాంధ్రమును ఆకర్షించుచున్నవి ఆ మహాపట్టణము యావదాంధ్రకు, ఎటువైపు చూచినను మధ్యస్థానముగా నుండుటచే కేంద్రముగా నుండి పరిపాలనా సౌకర్యమునకు అనుకూలము గానున్నది

తెలంగాణా ఏర్పడిన ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెనని కొందరు ఇటీవల ప్రకటించుచున్నారు కాని భాషా ప్రయుక్త ప్రాతిపదికముపై మనము అంగీకరించిన తర్వాత ఒకేభాష, సంస్కృతి, నాగరికత, ఆచారవ్యవహారములు, సాహిత్య సంపదగల ఆంధ్రులు వేర్వేరుగా నుండవలెననెడి సూత్రమును ఎవరును అంగీకరించజాలరు. ఇట్టి వ్యతిరేకభావములు కల్గుటకు కారణము లేమైనను కావచ్చును కాని విశాలహృదయముతో విషయమును సమగ్రముగా పరిశీలించినచో అనుమానములు సమసిపోవును.

పరిపాలనా సౌకర్యము ననుసరించియు, హైదరాబాదు రాష్ట్రము, తెలంగాణా, మహారాష్ట్రము అను రెండుభాగములుగా విభజించియే యున్నది రాయచూరు జిల్లాయు, గుల్బర్గా బీదరుజిల్లాలో కొంతభాగము లోను కన్నడభాష మాట్లాడు వారు కలరు ఈవిధముగా ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకభాగములతో హైదరాబాదురాష్ట్రముకూడియున్నది భారతదేశమునకు స్వాతంత్ర్యము లభించిన తరువాత, భాషాప్రయుక్త రాష్ట్రముల నిర్మాణమును ప్రజలు వాంఛించుచున్నారు ప్రజాస్వామిక పరిపాలన కాలమున ప్రజల కోరికలు నిరోధించబడజాలవు తెలంగాణమును ఆంధ్ర రాష్ట్రముతో చేర్చినచో హైదరాబాదురాష్ట్రములోని అవశిష్ట భాగములు, కర్ణాటక, మహారాష్ట్రభాగముల గతి ఏమగును అను ప్రశ్న వెంటనే బయలుదేరును సంయుక్త కర్ణాటకము, అఖండ మహారాష్ట్రములతో ఈభాగములు లీనమగుట తప్పనిసరి యగును. ఎప్పటికైనను ఇట్లు జరుగవలసినదే. అయితే కాలపరిస్థితులు అనుకూలమయ్యేటంతవరకు వేచియుండకతప్పదు

కొందరు ఆంధ్రేతరులు హైదరాబాదును చీఫ్ కమీషనరు రాష్ట్రముగా అభిప్రాయపడుచున్నారు ఇందుకు అనుగుణ్యముగా హైదరాబాదును భారతదేశానికి ఉపరాజధానిగా చేసి విశాలాంధ్ర ఉద్యమమునకు అవరోధము కల్పింప ప్రయత్నించుచున్నారు. కాని భౌగోళిక పరిస్థితి ననుసరించి హైదరాబాదును విశాలాంధ్రకు రాజధానికొక తప్పదు హైదరాబాదు నగరము ఆంధ్రనగరము దీనిని విశాలాంధ్రకు రాజధానిగా ఏర్పరచినచో గాని తెలంగాణమును ఆంధ్రరాష్ట్రములో చేర్చుటకు అంగీకరింప లేము అటు చెన్న పట్టణమును వదులుకొని, ఇటు హైదరాబాదునుకూడా త్రోసిపుచ్చుట ఆంధ్రులఅసంతృప్తికి కారణమగును దీనిని ఆంధ్ర ప్రజలు సహించజాలరు ఇట్టి ప్రయత్నమును ఆంధ్రులందరు ముక్తకంఠంతో ఎదుర్కొనవలెను తీవ్ర ఆందోళన చేయవలెను.

మహారాష్ట్రులు అఖండ మహారాష్ట్రము కావలెనని, కన్నడులు సంయుక్త కర్ణాటకమును వాంఛించుచున్నారు. ఆంధ్రరాష్ట్రము అవతరించినదేగాని, తెలంగాణముతోనిచో సమగ్ర ఆంధ్ర కాజాలదని ఆంధ్రుల ఆశయమైయున్నది ఈ నూతన రాష్ట్రముల నిర్మాణమునకు సంబంధించిన మూల సూత్రము భారత ప్రభుత్వము అంగీకరించియే యున్నది

ఇటీవలనే భారత ప్రభుత్వము వారిచే నియమించబడినరాష్ట్రములపునర్వ్యవస్థీకరణ సంఘము వారికి తమ ఆంధ్రదేశ పర్యటన సందర్భమున, హైదరాబాదు రాజధానిగా విశాలాంధ్ర నిర్మాణమును వెంటనే ఏర్పాటాలని, ఇతర రాష్ట్రములలోని తెలుగు ప్రాంతములను సత్వరమే విశాలాంధ్రలో కలుపవలెనని, ఆంధ్రులందరు తమగాఢ వాంఛను తమ కష్ట నిష్ఠురములను విన్నవించుకొనుటకూడా జరిగినది

కనుక ఆంధ్రులందరు హైదరాబాదు రాజధానిగా విశాలాంధ్రను ఏర్పడాలని, ఇతర రాష్ట్రములలోని-మద్రాస్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, మైసూరు, హైదరాబాదు, తెలుగు ప్రాంతములను సమగ్ర విచారణ జరిపించి, సహేతుకముగా విశాలాంధ్రలో చేర్పించవలెనని కేంద్రప్రభుత్వము వారిని కోరుచూ, విశాలాంధ్ర ఏర్పడిన సమగ్ర ఆంధ్ర సస్యశ్యామలంగా శోభాయమానము గా వర్ధిల్లగలదు. కనుక వెంటనే ఆంధ్రులందరు తమ ... అఖండిత ... ప్రభావముతో ... ఉద్యమమును సలుపగలరని విశ్వసించుచున్నాను.

# వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

## ౩౪

శ్రీకమల పత్రాక్షుడు ఆ ఇందీవరశ్యాముడు అసింహమధ్యముడు ఆ మహాత్ముడు రాముడు తన రాక తండ్రికి తెలియచేయమని సుమంత్రుడితో చెప్పినాడు. సుమంత్రుడికి దుఃఖము వచ్చింది. అతని దేహము అంతా కంపించి పోవడము మొదలు పెట్టింది. అయినప్పటికిన్నీ వెంటనే లోపలికి పోయినాడు. రాముణ్ణి గురించిన దుఃఖముతో నిట్టూర్పులు విడుస్తూ ఉన్న దశరథ మహారాజును చూచినాడు.

ఆయన రాహుగ్రస్తము అయిన సూర్యబింబమువలెనూ భస్మచ్ఛన్నము అయిన అగ్నిహోత్రమువలెనూ నిస్తోయము అయిన తటాకమువలెనూ అగుపించినాడు. మనోవ్యాకులముతో "రామా రామా" అంటూ దుఃఖపడుతున్నాడు. ఆయనతో ఏమి అని చెప్పడమా అని సుమంత్రుడు దిగులుపడి పోయినాడు. ఆ స్థితిలో ఏమి చెప్పితే ఏమి అజ్ఞాపిస్తాడోనని భయపడి పోయినాడు. ఆ ప్రాజ్ఞుడు చేతులు జోడించి ఆయన దగ్గరకు పోయి జయము ఆశీర్వదించి మందముగా మధురముగా "మహారాజా, పురుషశార్దూలము తమ పుత్రుడు రాముడు తమ దర్శనము కోసము వచ్చి వాకిటిలో కనిపెట్టుకొని ఉన్నాడు. అతడు తన ధనాన్ని అంతా బ్రాహ్మణులకూ భృత్యులకూ దానము ఇచ్చినాడు. మిత్రులు అందరికీ సెలవులు చెప్పినాడు. వనవాసానికి ప్రయాణము అయిపోతూ తమ అనుజ్ఞ కోసము సీతా లక్ష్మణుడు సహితముగా ఇక్కడికి వచ్చినాడు. అనంతకిరణాలతో తేజరిల్లే సూర్యుడివలె సమస్త రాజ గుణాలతో విరాజిల్లుతూ మీ దర్శనము అపేక్షిస్తూ ఉన్నాడు. తాము అతనికి దర్శనము ఇవ్వవలెను" అని చెప్పినాడు.

ఆ ధర్మాత్ముడు ఆసత్యవ్రతుడు దశరథ మహారాజు సముద్రమువలె గంభీరుడు, ఆకాశమువలె నిర్మలుడు, ఆయన సుమంత్రుణ్ణి చూచి "మంత్రిసత్తమా, నా భార్యలను అందరినీ ఇక్కడికి రప్పించవలెను, వాండ్ల సమక్షములో ఆధార్మికుణ్ణి చూస్తాను" అన్నాడు. రాజాజ్ఞను సుమంత్రుడు దశరథమహారాజు భార్యలు మున్నూట ఏభైమందికిన్నీ తెలియ చేసినాడు. వారు అందరూ రాముడు అడవికి పోతున్నాడు అని కన్నులు ఎర్రబడి పోయేట్లు ఏడుస్తూ కౌసల్యాదేవి వెనుక దశరథమహారాజు దగ్గరకు నడచినారు.

ఆయన అంతట రాముణ్ణి లోపలికి తీసుకొని రమ్మని సుమంత్రుడితో చెప్పినాడు.

భార్యలమధ్యను కూర్చునిఉన్న దశరథమహారాజు సుమంత్రుడి వెనుక చేతులు జోడించి నడచివస్తూఉన్న రాముణ్ణీ సీతాదేవినీ లక్ష్మణుణ్ణీచూచినాడు. లటాలున లేచినాడు. వారికి ఎదురుగుండా పరుగు తినాడు. దుఃఖార్తుడుఅయి వారిని సమీపించకుండానే నేలకూలినాడు. మూర్ఛపోయినాడు. ఆయనను లేవనెత్తడానికి రామలక్ష్మణులు పరుగెత్తుకొని వచ్చినారు. ఆయన భార్యలు అందరూ గొల్లుమన్నారు. "హా రామా" అంటూ వారు అందరూ నెత్తి బాదుకొంటూనూ గుండెలు కొట్టుకొంటూనూ ఏడవ సాగినారు. వారి ఏడ్పులకు వారి నడుబొబ్బలకు వారి ఆభరణాల చప్పుళ్లకు ఆ భవనముఅంతా కంపించి పోయింది.

రామలక్ష్మణులూ సీతాదేవీ దశరథమహారాజును పర్యంకముమీద పరుండబెట్టి ఉపచారాలు చేసినారు. కొంతసేపటికి ఆయనకు తెలివివచ్చింది. దుఃఖసముద్రములో మునుగుతూ తేలుతూ ఉన్న దశరథమహారాజును రాముడు చూచి "మహారాజా, తాము మాకు అందరికీ నాథులు. తమ అనుజ్ఞపొంది సెలవులు చెప్పిపోవడానికి వచ్చినాను. నేను దండకారణ్యానికి ప్రయాణము అయిపోతున్నాను. నన్ను తాము సంతోషముతో ఆశీర్వదించవలెను. ప్రభూ, ఈ సీత నాతో వస్తూ ఉంది. ఈ లక్ష్మణుడున్నూ నావెంట బయలుదేరినాడు. రావద్దు అని వీళ్ళకు నేను అనేకవిధాల చెప్పినాను. వీండ్లు వినలేదు. నేను లేకుండా వీండ్లు ఇక్కడ ఉండము అన్నారు. వీండ్లూ నాతో రావడానికి తాము అనుమతించవలెను. ప్రభూ, ప్రజలు అందరూ ఈ భూమిమీద సంచరించడానికి బ్రహ్మదేవుడు అనుజ్ఞ ఇచ్చినట్టు మేము వనవాసము చేయడానికి తాము అనుజ్ఞ ఇవ్వవలెను" అన్నాడు.

రాముడు ఏమాత్రమూ ఆలస్యము చేయకుండా వనవాసప్రయాణసన్నద్ధుడు అయివచ్చి తనను అనుజ్ఞ అడుగుతూ ఉన్నందుకు కించపడిపోయి "రామా నేను ఎప్పుడో కైకేయికి వరాలుఇచ్చి ఇప్పుడు మోసపోయినాను. నీవు ఇప్పుడు నన్ను నిగ్రహించి ఈ అయోధ్యకు రాజువు అయి రాజ్యము ఏలు" అన్నాడు దశరథమహారాజు.

రాముడు పరమధార్మికుడు: పరమ ధార్మికుడు మాత్రమే కాదు. మాటనేర్పరి. చేతులు ఎత్తి నమస్కారము చేస్తూ "ప్రభూ తాము ఎంతకాలము అయినా ఈ రాజ్యము ఏలవలెను. తాము పుణ్యమూర్తులు. నా నుంచి మీకు అసత్యదోషము రాకూడదు. మీ నుంచి నాకున్నూ అసత్యదోషము రాకూడదు. ఇప్పుడు నేను వనవాసము చేయటమే ధర్మము. రాజా, ఒక తొమ్మిది సంవత్సరాలు ఆ తరువాత ఒక అయిదు సంవత్సరాలు- ఏమి అంత పెద్దకాలము- సుఖముగా వనవాసము చేస్తాను. గడువుకాలము అయిపోగానే వచ్చి నేను మీ పాదాలమీద వాలుతాను." అన్నాడు రాముడు.

ఈ మాటలకు దశరథమహారాజు సత్యపాశబద్ధుడు అయిపోయినాడు. ఆయనకు దుఃఖము వచ్చింది. దీనుడు అయిపోయినాడు. వెంటనే రాముణ్ణి పంపించి వేయమని కైకేయీదేవి చెంపను చేరి చెవిలో ఊదటము మొదలు పెట్టింది. ఆయనకు ఏమీ తోచకుండా పోయింది. రాముణ్ణి చూస్తూ "నాయనా, పో, నీవు ప్రయాణము అయిపో, నీవు ఇహ పరలోక సౌఖ్యాలు అన్నీ అనుభవించవలెను. తిరిగి ఇక్కడికి రావలెను. ఈ రాజ్యము ఏలవలెను. నాయనా, నీవు నిర్భయమూ మంగళకరమూ అయిన సత్పథము అవలంబించు, పో.

రామా, నీవు రఘుకుల దీపకుడవు. సత్యవ్రతుడవు. పరమధార్మికుడవు అడవికి పోవలెను అని నీకు బుద్ధిపుట్టింది. నీ బుద్ధి మార్చటము ఎవరితరము. అయితే, నాయనా, నీవు ఇప్పుడే ప్రయాణము అయిపోవద్దు. ఈరాత్రి అంతా ఇక్కడనే ఉండు. ఒక్కపూట అయినా కళ్ళారా నిన్ను చూచి సంతోషిస్తాను. నీవు మీ అమ్మనూ నన్నూ చూస్తూ ఈరాత్రిఅంతా ఇక్కడనే ఉండు. మేము మాచిత్తము వచ్చినట్టుగా నిన్ను సంతోషపెట్టుతాము. నీవు రేపు ఉదయము ప్రయాణము అయిపోవచ్చును.

"నాయనా. నా పరలోక సౌఖ్యముకోసము నీవు సమస్త సౌఖ్యాలూ వదులుకొని కారడవులకు పోతున్నావా. ఇటువంటి దుష్కర కార్యము నీవు తప్ప ఎవరూ చేయరు. చేయలేరు. రామా, నిన్ను అడవికి పంపించడము నాకు ఎంతమాత్రమూ ఇష్టము లేదు. సత్యప్రమాణముగా చెప్పుతున్నాను. ఈ కైక నివురుకప్పిన నిప్పు. తన క్రౌర్యాన్ని తెలియనీయకుండా దాచిఉంచుకొన్నది. దీనిదగ్గిర నా ప్రజ్ఞ చలించింది. ఇది నన్ను మోసపుచ్చింది. నేను ఎన్నడో సంతోషముతో ఇస్తానుఅన్న వరాలను నన్ను ఏమరచి విపరీతముగా అడిగి పుచ్చుకొన్నది. నాయనా, ఈ కైక మన వంశాచారాన్ని నేలపాలు చేసింది. అయ్యో, ఈ కైక కోరికను నీవుకూడా సఫలము చేయవలసివచ్చింది. రామా, నీ ధార్మికతకు నాకు ఆశ్చర్యము వేస్తూ ఉంది. అయితే నీవు నా జ్యేష్ఠపుత్రుడవు. నాకు అసత్యదోషము రానీయకూడదు అనుకొన్నావు. ఆశ్చర్యము లేదు" అంటూ దశరథమహారాజు కన్నీళ్లు కార్చినాడు.

ఈ ఆర్తాలాపాలకు రాముడు లక్ష్మణుడి వంకచూచి దశరథమహారాజుతో "రాజా, మీరు ఈనాడు నన్ను సంతోషపెట్టుతారు, రేపు నన్ను ఎవరు సంతోషపెట్టుతారు. అందువల్ల నేను కోరికలు అన్నీ వదులుకొన్నాను. వనవాసము చేయడానికి సంకల్పించుకొన్నాను. ఈ నాబుద్ధి మారదు ప్రభూ, కైకేయిదేవికి తాము సంతోషముగా వరాలు ఇచ్చినారు. ఆ వరాలను మీరు సంపూర్ణముగా చెల్లించవలెను. మీ ఆజ్ఞను నేను శిరసా వహించి పద్నాలుగు సంవత్సరాలూ మహారణ్యములో మహర్షుల మధ్య నివసిస్తాను. మిమ్ములను నిగ్రహించమని చెప్పినారు. మీరు ఆలోచించవద్దు, ఈ రాజ్యము ఏలవలెను అనే కోరిక నాకు లేదు. ఇంకా ఏనాటి సుఖాలు అనుభవించవలెను అనే కోరిక నాకు అంతకన్నా లేదు. మీ ఆజ్ఞను నెరవేర్చటము ఒక్కటే నాకు ఉన్న కోరిక. మీరు దిగులుపడవద్దు. కన్నీళ్లు కార్చవద్దు. గంభీరుడు అయిన సముద్రుడు ఎప్పుడుఅయినా కలత చెందుతాడా. మీ ఆజ్ఞలను శిరసా వహించటముతప్ప నాకు ఈ రాజ్యముతో పని ఏమిటి. స్వామీ, నాకు కావలసింది తాము, తమ సత్యవ్రతము. నేను అనృతము అంగీకరించను నా సుకృతముమీదనూ నా సత్యముమీదనూ ఒట్టుపెట్టుకొని చెప్పుతున్నాను నేను ఇంక ఇక్కడ ఒక్క క్షణము అయినా ఉండను. నన్ను కైకేయీదేవి వనవాసానికి పొమ్మన్నది. నేను పోతాను అన్నాను. అందువల్ల మీ ఆజ్ఞను శిరసా వహించటమే కాకుండా ఆమెకు ఇచ్చిన మాటను నిలబెట్టుకొన్నవాణ్ణి అవుతాను.

"దేవా, దైవతలకు సయితము తండ్రే ప్రత్యక్షదైవము అని చెప్పగా విన్నాను. అందువల్ల నా తండ్రే నాకు దేవుడు అనుకొంటున్నాను. ఆయన ఆజ్ఞను తల దాల్చటమే నా పని. నేను నా వనవాసము అయిపోయినతరువాత వచ్చి మీకు దర్శనము చేస్తాను. తాము ఇక దిగులుపడవద్దు. ప్రభూ నా తల్లులు అందరూ నేను వనవాసానికి పోతున్నాను అని గద్గదకంఠులుఅయి కన్నీళ్లు కారుస్తున్నారు. [illegible] మీరు దుఃఖపడవద్దు.

దేవా, నేను ఈపట్టణమూ ఈ రాజ్యమూ వదులుకొని పోతున్నాను. కనుక పట్టణాలతో నూ పర్వతాలతో నూ వనాలతో నూ సుస్థిరములయిన హద్దులతో నూ ధనధాన్య సమృద్ధముగానూ సర్వశుభావహముగానూ ఉన్న ఈరాజ్యాన్ని భరతుడికి ఇవ్వండి. వాడే ఈ రాజ్యాన్ని అంతా పరిపాలిస్తాడు. మీరు ఆజ్ఞాపించినట్టు జరిగితీరవలెను: మీ ఆజ్ఞలను నేను శిరసా వహించటము శిష్టజన సమ్మతము అయిన విషయము. అందువల్ల మీ ఆజ్ఞలను నెరవేర్చటములో ఉన్న ఈ తొందర నాకు మరిదేనిమీదనూ లేదు. నేను ఏదో కష్టపడుతాను అని మీరు దుఃఖపడవద్దు. తమకు అసత్యదోషము రాకుండా ఉండటమే నా ధ్యేయము. తమ సత్యవ్రతముకోసము నేను దేనిని అయినా వదులుకొంటాను. ఏ సుఖాన్ని అయినా వదులుకొంటాను. ఈ సీతనుఅయినా వదులుకొంటాను అందువల్ల నేను ఇప్పుడు ఈరాజ్యము వదులుకొనిపోవడము ఒకగొప్ప విషయము కాదు, తమ సత్యవ్రతానికి నావల్ల భంగపాటు రాకూడదు.

"రాజా, నేను ఈ సీతతోనూ లక్ష్మణుడితోనూ మహారణ్యాలలో ప్రశాంత హరిణాలతో నానావిధ శకుంతకూజితాలు వింటూ విహరిస్తాను చిత్రవిచిత్రములయిన వృక్షాలుచూస్తూ వివిధ ఫలాలూ కందమూలాలూతింటూ గిరి గుహలలో నివసిస్తూ ఆయా నదులలోనూ సరస్సులలోనూ స్నానము చేస్తూ హాయిగా కాలము గడుపుతాను. రాజా తామున్నూ ఇక్కడ సుఖముగా ఉండండి" అని చెప్పినాడు రాముడు.

దశరథ మహారాజు దుఃఖాగ్నిలో పడిపోయినాడు. ఆయనకు తాపము ఎత్తింది. ఏడుపు వచ్చింది. పెద్దపెట్టున ఏడుస్తూ రాముణ్ణి గట్టిగా కౌగలించుకొన్నాడు, స్మృతితప్పి పడిపోయినాడు.

కైకేయీదేవి తప్ప తక్కిన రాజపత్నులు అందరూ గొల్లుమన్నారు,

ఇది అంతా వింటున్న సుమంత్రుడు అవురుమని ఏడుస్తూ మూర్ఛపోయినాడు.

అక్కడివారు అందరూ "అయ్యో అయ్యో" అంటూ పెద్దపెట్టున వాపోయినారు.

## ౩౫

సుమంత్రుడు తెప్పరిల్లి నిట్టూర్పులు విడుస్తూ తల ఆడిస్తూ చేతులు నులుపుకొంటూ పళ్లు పటపట కొరికినాడు. కోపావేశముతో అతని కన్నులు కెంపులవలె ఎర్రబడిపోయినవి. ముఖముఅంతా నెత్తురుముద్ద అయిపోయింది. ముఖమేకాదు - అతని దేహముఅంతా ఎర్రబడిపోయింది. సంతాపపడుతూ ఉన్న దశరథ మహారాజువంక చూచినాడు. ఆయనమనస్సు తెలుసుకొన్నాడు. తీక్ష్ణబాణాలతో మర్మస్థానాలను ఛేదించేటట్టు వాగ్బాణాలతో కైకేయీదేవి హృదయాన్ని చిందరవందర చేయవలెను అనుకొన్నాడు.

అంతట సుమంత్రుడు ఆమెనుకట్టు అంతా బట్టబయలు చేయ తలచుకొని "ఓ దేవీ, చరాచరాత్మకము ఈ జగత్తుకు అంతటికీ దశరథమహారాజు ప్రభువు. మీకు పెనిమిటి, ఆయన తలపెట్టినపని మీరు "కాదు" అన్నారు. మీరు ఆయనను తిరస్కరించినారు. ఇక మీరు ఈలోకములో చేయలేని అకార్యము ఏదీ లేదు.

దశరథమహారాజు దేవేంద్రుడివలె అజయ్యుడు. హిమాచలమువలె అచలుడు. మహోదధివలె అక్షోభ్యుడు. అటువంటివాణ్ణి మీరు ఇట్టే దుఃఖాల పాలు చేసినారు. ఆయనను ఇక మీరు బంపివేస్తారేమో ననిపిస్తూ ఉంది, కాదు, కాదు. ఆయనవంశాన్ని నాశనము చేసి వేస్తారేమో ననిపిస్తూ ఉంది.

అమ్మా, ఆయన మనలను అందరినీ పోషిస్తున్నాడు. మనముకోరిన కోరికలు ఇస్తున్నాడు. మనము అందరమూ ఆయనను అనుసరించి పోవలెను. అందులో మీరు ఆయనను చేపట్టినవారు ఆయనను ఎప్పుడూ అనుసరిస్తూ సంతోషపెట్టుతూ ఉండవలెను. ఒకకోటిమంది కొడుకులను కని పెంచడముకన్నా పెనిమిటిని ఒక్కణ్ణీ అనుసరించి మెప్పించడమే ఆడుదాని ధర్మము. అంతకన్నా అధికము అయినధర్మము ఆడుదానికి మరిఒకటి లేదు.

"ఓ రాణీ, రాజు చనిపోయినప్పుడు కొడుకులలో వయస్సునుపట్టి పెద్దవాడు రాజు అవుతూ ఉంటాడు. తక్కిన కొడుకులు ఆ పెద్దవాణ్ణి అనుసరించుకొని ఉంటారు. ఇది లోకధర్మము. ఈ ధర్మాన్నే ఇక్ష్వాకువంశీయులు అనూచానముగా అనుసరిస్తున్నారు. మీరు దశరథమహారాజు జీవించిఉండగానే ఆయనచేతనే కులక్రమాగతము అయిన ఈ ధర్మాన్ని చెడగొట్టించ తలచినారు. మీరు కృతార్థులు అయితే కావచ్చును. మీ పుత్రుడు భరతుడే రాజుఅయితే కావచ్చును. ఈ భూమిని అంతా అతడే ఏలవచ్చును. మేము మాత్రము రాముడు పోయేచోటికే పోయిఉంటాము. మేమేకాదు, ఏ ఒక్క బ్రాహ్మణుడున్నూ ఈ అయోధ్యానగరములో కాపురము ఉండడు. యోగ్యులు అయినవారు ఎవరూ ఈ అయోధ్యలో ఉండకుండా పోయేటంతటి అమర్యాద పనికి మీరు తలపడినారు.

అమ్మా, మీరు ఎంతటి అపచారానికి పూనుకొన్నారు. మీరు ఇప్పుడు రాముణ్ణి అరణ్యవాసము చెయ్యించమని పట్టుపట్టుతూ ఉన్నందుకు బ్రహ్మర్షులు యమదండముకన్నా భయంకరము అయిన తమ వాగ్దండాలతో మిమ్మలను ఎందుకు ప్రహరించకుండా ఉన్నారో తెలియడములేదు. మీరు పూనుకొన్న ఈ పాపకర్మకు ఈ భూమి ఇంకా ఎందుకు బ్రద్దలు అయిపోకుండా ఉన్నదో అని ఆశ్చర్యము వేస్తూ ఉంది.

"ఓ రాజపుత్రీ ఎవరుఅయినా గొడ్డలి తీసుకొని పనికట్టుకొని తియ్యని పండ్లుపండే మామిడిచెట్టును నరికివేసి వేపమొక్కకు పాదులుకట్టి పాలుపోసి పెంచితే అది తియ్యనికాయలు కాస్తుందా. అజ్ఞానముగా దశరథ మహారాజు తన పట్టమహిషిని వదిలిపెట్టి మిమ్ములను ఆదరించినాడు. ఇప్పుడు మీరు ఇట్లా చేసినారు. ఇప్పుడు మిమ్ములను అని ప్రయోజనము ఏమిటి. మీరు గొప్పవంశములోనుంచే వచ్చినారు. అయితే వేపచెట్టుకు ఎప్పుడుఅయినా తేనె కారుతుందా. మీరు మీతల్లిగుణాన పుట్టినారు. మీతల్లికథ ఇదివరకే నేను విన్నాను.

"పూర్వము ఒక మహాత్ముడు మీ నాయనగారికి సమస్త ప్రాణికోటుల భాషలూ బోధపడేవరము ఇచ్చినాడు. ఆవరప్రభావమువల్ల పిపీలికాది సమస్త జీవరాసుల మాటలూ మీ నాయనగారికి తెలుస్తూఉండేవి. ఒకనాడు మీ నాయనగారు పాన్పుమీద పడుకొని ఆప్రక్కనే చీమలు చెప్పుకొంటూఉన్న మాటలు విన్నారు. ఆచీమలమాటలకు ఆయనకు నవ్వువచ్చింది. పెద్దపెట్టున చాలాసేపు నవ్వినారు. మీనాయనగారు తనను అపహసిస్తున్నాడు అని మీ అమ్మకు కోపమువచ్చింది. ఎందుకునవ్వింది చెప్పమని మీఅమ్మ అడిగింది. నవ్వినకారణము చెప్పేట్లయితే తనకు వెంటనే చావుమూడుతుంది అని మీ నాయనగారు ఎంతోదూరము చెప్పినారు. మీఅమ్మ వినలేదు "చావండి, బ్రతకండి, ఏమిఅయినాకండి, చెప్పవలసిందేను" అని పట్టుపట్టింది. అంతట మీ నాయనగారు వరముఇచ్చిన ఆయనను అడిగినారు, ఆవరప్రదాత "ఏది ఏమి అయినా చెప్పకూడదు" అన్నాడు. మీఅమ్మ అప్పటికిన్నీ ఊరక ఉండకుండా మీ నాయనగారిని నిర్బంధించి బాధ పెట్టసాగింది. తనచావుకు కూడా మీఅమ్మ లెక్క చేయడములేదు అని మీనాయనగారికి పట్టరానికోపము వచ్చింది. అంతట మీఅమ్మను వెళ్లగొట్టినాడు. అప్పటనుంచీ మీ నాయనగారు కుబేరుడివలె సుఖముగా ఉంటూ ఉన్నారు.

"ఓ దేవీ, మీరున్నూ, ఇప్పుడు మీ తల్లివలె దుష్టచారిణుల దారి పట్టినారు. పాపానికి ఒడికట్టుకొన్నారు. తల్లి గుణము కూతుళ్లకూ తండ్రి గుణము కొడుకులకూ వస్తుంది అనే లోకోక్తిని యథార్థము చేసున్నారు. మీ అజ్ఞానము వల్ల మీ పెనిమిటి దశరథమహారాజు చేత చేయించకూడని పని చేయించటానికి పూనుకొన్నారు. అందువల్ల ఆయనకు భరించరాని అపయశస్సువస్తుంది. ఆయన ననిపోకా పేమో-మీరు అట్లా చేయవద్దు. మీరు మీ పెనిమిటికి విధేయులుగా ఉండవలెను. మహాజనసభామధ్యములో రాముడికి యువరాజ్యాభిషేకము చేసాము అని వారు ప్రకటించినారు. వారి మాట మీరు అబద్ధము చేయించవద్దు. రాముడు అరణ్యవాసానికి వెళ్లిపోతున్నాడు అని పౌర జానపదులు అందరూ దుఃఖపడుతున్నారు. వారి అందరి దుఃఖాన్నీ మీరు పోగొట్టవలెను. వారిని అందరినీ మీరు సంతోషపెట్టవలెను. వారసులు ఎవరో పిన్నవాడికి పట్టము కట్టించి పెద్దవాణ్ణి అడవులకు వెళ్లగొట్టించమని మిమ్ములను పురికొల్పినారు. ఆ అధర్మానికి మీ పెనిమిటిని పొల్పమని మీరు నిర్బంధిస్తున్నారు.

తల్లీ, ఈ దశరథమహారాజు దేవేంద్రుడితో సరిసమానము అయిన లోకపాలుడు. లోకనాథుడేకాదు, మీకు నాథుడు. మీరు ఆయనను అధర్మముపాలు చేస్తున్నారు. అమ్మా, ఆయన మీకు వాగ్దానము చేసిన వరాలు పొల్లుపోతవేమో అనుకోవద్దు. ఈరాజీవాక్షుడు ఈశ్రీమంతుడు ఈశరణ్యుడు మీకు ఈ రాజ్యముకన్నా ఎక్కువ ఐశ్వర్యము ఇచ్చి మీ వరాలు చెల్లిస్తాడు. కాని మీరు గాలివానచేసి ప్రమాణము చేయించుకొన్న మీ వరాలు చెల్లించడు. మీరు అనుకొన్నట్టు మీ వరాలు చెల్లినాయి అనే ఆశ మీరు పెట్టుకోవద్దు.

అమ్మా, రాముడు జ్యేష్ఠుడు. వదాన్యుడు. సదాచారసంపన్నుడు. స్వధర్మరక్షకుడు. లోకరక్షకుడు. మహాబలవంతుడు. అతనికే పట్టాభిషేకము జరుగవలెను. ఓ తల్లీ, రాముడు ఇప్పుడు తండ్రిని వదిలిపెట్టి వనవాసానికిపోయేట్లయితే మీకు గొప్ప అపవాదు వస్తుంది. మీకన్నా ఎక్కువగా దశరథమహారాజుకు అపయశస్సువస్తుంది. ఈ రాజ్యములో ధర్మము నాశనముఅయిపోతుంది. అమ్మా, అందువల్ల రాముడే రాజ్యము ఏలవలెను. రాముడే లేకపోయేటట్లయితే ఈ అయోధ్యలో బ్రాహ్మణులు ఎవరూ నివసించరు. ఓ తల్లీ, రాముడే యువరాజ్యాభిషేకము అయిపోగానే దశరథమహారాజు పూర్వ రాజర్షుల నడతగా తపస్సు చేసుకోడానికి అడవులకు వెళ్లిపోతారు. మీరు అందుకు వారికి తోడ్పడవలెను" అన్నాడు.

సుమంత్రుడు రాజసముక్షములో ఇంత నిష్ఠురముగా మాట్లాడి ఇన్ని మంచి మాటలు చెప్పినా కైకేయీదేవి క్షోభపడలేదు. ఆమె హృదయము చలించలేదు. ఆమె ముఖములో క్రౌర్యపుచిన్నెలుఅయినా మారిపోలేదు. ఆమె నిశ్చయముగా ఊరకఉన్నది.

## ౩౬

కైకేయీదేవికి కోరినటువంటి వరాలు చెల్లిస్తాను అని చేసిన శపథము తప్పించుకోడానికి దారికనపడక దశరథమహారాజు కన్నీళ్లుకారుస్తూ "ఓ సుమంత్రుడా రత్నరాసులతోనూ సమస్త శస్త్రాస్త్రాలతోనూ చతురంగసేనలూ రాముడి వెంట పోవడానికి వెంటనే ఏర్పాటుచేయవలసింది. రాముడి ముఖ్యాశ్రితులనూ వీర్యపరీక్షార్థము రాముడు తనదగ్గిర ఉంచుకొన్న వీరులనూ ఆయుధాలు చేసి జీవించేవారినీ సేనలు విడిదిచేసే చోట దుకాణాలు పరుచుకొని ఆయావస్తువులు అమ్మేవర్తకులనూ పాటలుపాడుతూ ఆటలుఆడే అందకత్తెలు అయిన వేశ్యాంగనలనూ పౌరముఖ్యులనూ అడవిదార్లు చూపించే బోయవాండ్లనూ ఇంకా రాముడి వెంట పోతాము అనే వారిని అందరినీ రాముడివెంటపోయే సేనాసమూహములో పంపించి వేయవలసింది. వారివారికి కావలసిన ధనమూ వస్త్రాలు మొదలు అయినవి అన్నీ ఇవ్వవలసింది. ఇంకా నూనె నెయ్యి మొదలు అపరూపవస్తువులను బండ్లమీదవేసి పంపించవలసింది. నాధనకోశాన్నీ ధాన్యకోశాన్నీ కూడా రాముడితో పంపించి వేయవలసింది. ఇట్లా చేసేట్లయితే అడవులలో క్రూరమృగాలనూ అడవి ఏనుగులనూ వేటాడుతూనూ ఆయా పుణ్యనదులలోనూ పవిత్రప్రదేశాలలోనూ స్నానము చేస్తూనూ అడవి తేనె త్రాగుతూనూ నాపిల్లవాడు రాముడుకోసల రాజ్యాన్ని మరచిపోకలుగుతాడు. పుణ్యక్షేత్రాలలో యజ్ఞాలుచేస్తూనూ పుణ్యపురుషులకు యథోక్తదక్షిణలు ఇస్తూనూ పోయి నాపిల్లవాడు మహారణ్యములో మహర్షులమధ్య సుఖముగా ఉంటాడు.

"రాముడు శ్రీమంతుడుగా వనవాసము చేయవలెను. భరతుడు తన భుజబలముతో ఈ అయోధ్యలో రాజ్యపాలనము చేయవలెను" అని ఆజ్ఞాపించినాడు.

ఈఆజ్ఞను కైకేయీదేవి విన్నది. ఆమెకు భయము వేసింది. ఆమెముఖము ఎండిపోయింది. గొంతు ఆరిపోయింది. ఏడుపు ముఖముతో దశరథ మహారాజుకు ఎదురుగుండాపోయి "రాజా, రాముడివెంట సమస్తమూ పంపించివేస్తే పౌరులు అందరూ వెళ్లిపోతే అయోధ్యానగరము సురాపానాన్ని త్రాగివేసిన సురాభాండమువలె అయిపోతుంది. అటువంటిరాజ్యము భరతుడు ఒల్లడు" అంటూ సిగ్గూ భిడియమూ లేకుండా అంతిమందిలోనూ అన్నది.

ఆ పెద్ద పెద్ద కళ్ల కైకేయీదేవిని చూస్తూ "ఓ ఎస్తలమారీ, మోయరాని బరువు నా నెత్తిన ఎత్తినావు. ఇంకా నన్ను ఎందుకు హింసపెట్టుతావు. రాముడి వెంట చతురంగబలాలూ పోకూడదు అని నీవు ఇదివరకు నన్ను వరము అడిగినావా" అంటూ దశరథమహారాజు ప్రశ్నించినాడు. ఈ ప్రశ్నకు కైకేయీదేవికి కోపము ఇబ్బడి అయింది. అంతట ఆమె "రాజా, తమ పూర్వుడు సగరచక్రవర్తి తన జ్యేష్ఠపుత్రుడు అశ్వమంజుణ్ణి అయోధ్యానగరమునుంచి అడవులకు వెళ్లగొట్టినట్టు తాము రాముణ్ణి పంపించివేయవలెను" అన్నది.

"ఛీ ఛీ" అన్నాడు దశరథమహారాజు.

ఆమె మాటలకు అక్కడ ఉన్నవారు అందరూ ఏవగించుకొన్నారు. ఆమె ఎవరినీ ఏమాత్రమూ లక్ష్యము చేయలేదు. దశరథమహారాజుతో ఆమె ఇంకా ఏమో మాట్లాడబోయింది.

వృద్ధుడూ పరిశుద్ధుడూ మహామాత్యుడూ అయిన సిద్ధార్థుడు అప్పుడు "ఓ దేవీ, అశ్వమంజుడు దుష్టుడు. అయోధ్యానగరవీధులలో ఆడుకొనే పిల్లలను మరిపించి తీసుకొనిపోయి సరయూనదిలో పడతోసి సంతోషిస్తూ ఉండేవాడు. అందుకు అయోధ్యా నగరవాస్తవ్యులు అందరూ క్రుద్ధులు అయిపోయి సగరచక్రవర్తి దగ్గిరకుపోయి "రాజా, మేము అందరమూ అయోధ్యానగరములో ఉండవలెను అనేట్లయితే తాము అశ్వమంజుణ్ణి తమ పుత్రుడు అని మన్నించకుండా అడవులకు వెళ్లగొట్టించవలెను. తాము అతణ్ణి వెళ్లగొట్టము అనేట్లయితే మేము అందరమూ ఈ అయోధ్యానగరము వదిలిపెట్టిపోతాము" అని చెప్పినారు. ఎందుకు అంత భయపడుతున్నదీ వారిని సగరచక్రవర్తి చెప్పమన్నాడు.

"ప్రభూ, అశ్వమంజుడి బుద్ధి భ్రంశము అయిపోయింది. వీధులలో అమాయకముగా ఆడుకొనే పిల్లలను మాయచేసి తీసుకొనిపోయి సరయూనదిలో పడతోసి చంపివేస్తున్నాడు. అతనికి అది ఒక వేడుక అయిపోయింది" అని పౌరముఖ్యులు చెప్పినారు. సగరచక్రవర్తి ఆ విషయము విచారించినాడు. అశ్వమంజుణ్ణి అతని భార్యనూ కట్టుగుడ్డలతో అప్పటికి అప్పుడు రథము ఎక్కించి అడవులకు పంపించివేసినాడు. జీవముతో అశ్వమంజుడు తిరిగి అయోధ్యానగరానికి రాకూడదు అనికూడా శాసనము చేసినాడు.

"ఆ అశ్వమంజుడు పాపిష్టివాడు అయి అడవులలో ఒకగుద్దలితోనూ చిన్నగంపతోనూఅన్ని దిక్కులా తిరుగుతూ కందమూలాలుతవ్వుకొనితింటూ కాలము గడిపినాడు. మహాపరాధము చేసినందువల్ల మహాధార్మికుడు అయిన సగరచక్రవర్తి తన జ్యేష్ఠపుత్రుడు అని మన్నించకుండా అశ్వమంజుణ్ణి అడవులకు వెళ్ళగొట్టినాడు.

"అమ్మా, ఈరాముడు ఏమి అపరాధము చేసినాడు అని దశరథమహారాజు ఇప్పుడు ఇతనిని అడవులకు వెళ్ళగొట్టవలెను. మాకు రాముడిలో ఏఒక్క దోషమూ కనిపించటము లేదు. రాముడు చంద్రుడివలె నిర్మలుడు. ఓ రాణీ, నిజముగా ఈరాముడిలో ఏ ఒక్కదోషముఅయినా మీకు కనపడ్డట్టయితే చెప్పండి. దశరథమహారాజు ఈతణ్ణి ఇప్పుడే అడవులకు వెళ్ళగొట్టుతాడు. ఏ దోషమూ లేనివాణ్ణి అందులో పరమ ధార్మికుడు అయినవాణ్ణి అకారణముగా అడవులకు వెళ్ళగొట్టడము అధర్మము. అపరాధము. అటువంటి అధర్మము దేవేంద్రుడు అంతటి తేజోవంతుణ్ణి అయినా దహించివేస్తుంది" అని చెప్పినాడు.

సిద్ధార్థుడి మాటలకు దశరథమహారాజు శోకోపహతుడుఅయిపోయినాడు. అతిహీనస్వరముతో "ఓ పాపిష్ఠురాలా, ఈసిద్ధార్థ మంత్రిచెప్పింది నీకునచ్చదు. నాకు తెలుసును. నీది కుత్సితపు బుద్ధి. నీవి దుశ్చేష్టలు. నాకు మేలు ఏదో నీకు మేలు ఏదో నీకు తెలియదు. నీవు తెలుసుకోలేవు. నీవు సన్మార్గము వదిలిపెట్టినావు.

"ఓ కైకా, నేను ఇప్పుడు ఈరాజ్యాన్ని త్యజించివేస్తున్నాను. రాముడి వెంట వెళ్లిపోతున్నాను. నీవు భరతమహారాజుతో బహుకాలము యథేష్టముగా ఈరాజ్యము ఏలుతూ ఉండు" అన్నాడు దశరథమహారాజు.

## ౩౭

ప్రధానామాత్యుడు సిద్ధార్థుడు చెప్పింది రాముడు విన్నాడు. అత్యంత వినయముతో దశరథమహారాజును చూచి "రాజా, నేను భరతుడికోసము సమస్త భోగభాగ్యాలూ వదులుకొని సర్వసంగపరిత్యాగము చేసి వనవాసము చేయడానికి పోతున్నాను. నేను అక్కడ కందమూలాలు తింటూ కాలము గడపవలెను. నాకు అనుచరులు ఎందుకు. సేనలు ఎందుకు. మదపుటేనుగును దానము ఇచ్చిన తరువాత దాని నడుముకు కట్టే తాడు అట్టిపెట్టుకోడము ఎందుకు. ఆశ దాని మీద మోజు ఎందుకు. అందువల్ల ప్రయోజనము ఏమిటి. సేనలూ మొదలు అయినవి అన్నీ భరతుడికే ఉండవలెను. వాడికే తాము ఇవ్వవలెను. మీరు ఇప్పుడు నేను కట్టుకోడానికి వల్కలాలు తెప్పించవలెను. నేను పద్నాలుగు సంవత్సరాలు వనవాసము చేయవలెను. కనుక నాకు ఒక గుద్దలీ ఒక చిన్న గంపా ఇప్పించవలెను" అన్నాడు రాముడు.

అక్కడివారు అందరూ ఏమి అనుకొంటారోననే సిగ్గుఅయినా లేకుండా కైకేయీదేవి స్వయముగా వారికి ముగ్గురికీ వల్కలాలు తెచ్చింది. రాముణ్ణి ఆవల్కలాలు కట్టుకోమన్నది. రాముడు తన సన్ననివస్త్రాలు విడిచివేసి ఆవల్కలాలు రెండూ కట్టుకొన్నాడు. లక్ష్మణుడున్నూ అక్కడనే తండ్రి సమక్షములోనే తన అందముఅయిన దుస్తులను వదిలివేసి ఆనారబట్టలు కట్టుకొన్నాడు.

సీతాదేవి తాను కట్టుకోవలసిన రెండు వల్కలాలనూ చూచింది. వలను చూచిన లేడివలె భయపడిపోయింది. అంతిమునకవి కట్టుకోడము ఎట్లాగా అని భయపడడమే కాకుండా అంతచిన్నవి కట్టుకోడము ఎట్లాగాఅని దిగులు పడ్డది. సిగ్గుపడ్డది. ఆజనకరాజపుత్రి ఆశుభాంగి ఆపతివ్రత ధర్మదర్శిని ఆవల్కలాలు కట్టుకోడానికి సతమతమౌ ప్రయత్నము చేసింది. అవి కట్టుకోటము ఆమెకు చేతకాలేదు. నివ్వెరపోయి నిలుచున్నది. ఒకవల్కలాన్ని భుజముమీద వేసుకొన్నది. రెండవదాన్ని చేతితో పట్టుకొన్నది. కట్టుకోడము చేతకానందుకు సిగ్గుపడిపోయి గంధర్వరాజువంటి రాముణ్ణిచూచి కన్నీళ్లు కారుస్తూ "నాథా తాపసాంగనలు ఈనారచీరలు ఎట్లా కట్టుకొంటారు" అని అడిగింది. రాముడు అంతట ఆమెకట్టుకొని ఉన్న తెల్లపట్టుచీర మీదనే వాటిని కట్టి చూపించ పోయినాడు.

అప్పుడు అంతఃపురాంగనలు అందరూ ఘొల్లుమన్నారు. వారు అందరూ కన్నీళ్లుకారుస్తూ రాముడితో "ఓ తేజస్వీ, ఈ సీతాదేవిని వనవాసము చేయమని మీ నాయనగారు ఆజ్ఞాపించలేదు. నీవు మీ నాయనగారి ఆజ్ఞను శిరసావహించి ప్రయాణము అయిపోతున్నావు, మంచిదే. అయితే నీవు ఈ సీతను తీసుకొనిపోవద్దు. నీవు తిరిగి వచ్చేటంతవరకూ నీకు బదులు ఈ సీతను చూస్తూ మేము బ్రతుకుతాము. నీకు లక్ష్మణుడు తోడుగా వస్తూఉన్నాడు. అందువల్ల సీతను ఇక్కడనే ఉండవలెను. ఈ సీత మంగళస్వరూపిణి. ఈమె తాపసాంగనవలె అరణ్యములో ఉండవలసినది కాదు. నాయనా, నీవు ధర్మనిత్యుడవు. మేము ఎంతచెప్పినా నీవు ఇక్కడ ఉండవు. కనుక ఈ సీతను ఇక్కడనే మా దగ్గిరనే ఉంచిపో, మేము నిన్ను యాచిస్తున్నాము" అన్నారు.

ఈ మాటలకు కైకేయీదేవి చూస్తూ ఊరకున్నది. రాముడు అంతఃపురాంగనల మాటలువింటూనే తనతోపాటు వనవాసానికి వస్తూఉన్న సీతాదేవికి ఆ నారచీరలు కట్టుకోడము నేర్పించినాడు.

సీతాదేవి అంతట ఆ నారచీరలు కట్టుకోబోతూఉంటే రాజగురువు వసిష్ఠమహర్షి అవి కట్టుకోవద్దు అని ఆమెతో చెప్పి కైకేయీదేవిని చూచి "ఓ కైకా, నీకు దుర్బుద్ధి పుట్టింది. నీవు సదాచారాన్ని నష్టించినావు. నీవు నీమర్యాదను అతిక్రమించినావు. వంశనాశానికి పూనుకొన్నావు. ఈ దశరథ మహారాజును మోసముచేసినావు, ఇంకా నీకు తనివి తీరలేదు. ఇప్పుడు ఈ సీతను వంచన చేస్తున్నావు. ఈమె రాణి. ఈమె అడవికి పోనవసరములేదు. ఇప్పుడు రాముడికోసము సిద్ధముచేసిన సింహాసనము ఈమె అధిష్ఠించవలెను. గృహస్థులకు అందరికీ భార్య ఆత్మస్వరూపము. ఇది వేదవాక్యము. ఈ సీతాదేవి రాముడి ఆత్మస్వరూపము. రాముడు లేనప్పుడు రాముడిరాజ్యము ఈమే ఏలవలెను.

"ఓ కైకా, ఈమె నీ కోడలు. ఈమె నారచీరలు కట్టుకోవలసిన ఆమె కాదు. నీవు ఈమెకు మంచి మంచి చీరలూ శ్రేష్ఠము అయిన ఆభరణాలూ ఇవ్వవలెను. నీవు ఈమెను నారచీరలు కట్టుకోనీయకూడదు.

"ఓ దేవీ, భరతుడు ఈదశరథమహారాజు పుత్రుడే అయినట్లయితే ఈయన మనఃపూర్వకముగా ఈయని రాజ్యము ఒల్లడు. రాజ్యము ఏలడు. అంతేకాదు. నిన్ను తనతల్లిగా మన్నించడు. నీవు ఆకాశానికి ఎగిరినా భరతుడు తనవంశక్రమానుగతము అయిన సద్ధర్మాన్ని చెడగొట్టడు. నీ పుత్రవాత్సల్యము నీకొమారుడికి కీడే అవుతుంది. నీకు తెలియదు. రాముడు అరణ్యవాసము చేస్తున్నాడు అంటే నీ కుమారుడు భరతుడున్నూ వల్కలాజినధారి అయి శత్రుఘ్నుణ్ణి వెంట తీసుకొని రాముడి దగ్గరకేపోయి వనవాసము చేస్తాడు. రాముణ్ణే అనుసరించుకొని ఉంటాడు.

"ఓ కైకా, నీవు రాముణ్ణి ఒక్కడినే వనవాసము చేయించమనికోరినావు. కాని ఈ సీతాదేవినికూడా వనవాసము చేయించమని దశరథమహారాజును కోరలేదు. ఈమె ఈ సీతాదేవి భర్తతో వనవాసము చేయడానికే సంకల్పించుకొన్నట్లయితే రాముడివలె ఈమె వల్కలాలు ధరించ నవసరములేదు. ఈమె ప్రతిదినమూ ఆభరణాలు అన్నీ పెట్టుకొని అలంకారాలు అన్నీ చేసుకొని రాముడితో ఉండవచ్చును. ఈ జనకరాజపుత్రి వెంట ఈమె వాహనాలూ పరిచారికలూ కూడా పోయిఉండవచ్చును. ఈమె తన సమస్త వస్తువులూ వెంట తీసుకొని పోవచ్చును" అన్నాడు.

అబ్రాహ్మణోత్తముడు ఆ అప్రతిమాన ప్రభావుడు దశరథమహారాజు కులగురువు వసిష్ఠమహర్షి ఇంత చెప్పినా కైకేయీదేవి చలించలేదు. సీతాదేవి మనస్సున్నూ మారలేదు. ఆమె భర్తకు అనురూపముఅయిన వేషముతోనే వనవాసానికి పోవలెను అనుకొన్నది.

## ౩౮

సీతాదేవి నారచీరలు కట్టుకొన్నది. అక్కడ ఉన్నవారు అందరూ దశరథమహారాజును చూస్తూ "ఛీ ఛీ" అన్నారు. ఆయన దుఃఖాక్రాంతుడు అయిపోయినాడు. బ్రతుకుమీదనూ ధర్మముమీదనూ కీర్తిమీదనూ ఆయనకు అసహ్యము వేసింది. వేడివేడి నిట్టూర్పులు విడుస్తూ "ఓ కైకా, ఈసీత నారచీరలు కట్టుకోవలసిన అవసరములేదు. ఈమె సుకుమారి. బాల. ఈమెఎప్పుడూ సుఖమే అనుభవించవలెను వనవాసము చేయవలసినదికాదు అంటూ కులగురువులు వసిష్ఠుల వారు చెప్పినారు. అది యథార్థము. ఈజనకరాజసుత ఈపాతివ్రత్యతపోయుక్త వల్కలాలు ధరించి ఇంతమంది సమక్షములోనూ మైమరచిన ప్రమత్తవలెనిలుచున్నది. ఈమె ఎవరికి ఏమి అపకారముచేసింది. ఓ కైకా, ఈసీత నారచీరలుకట్టుకొని రాముడితో అడవికిపోవలెను అని నేను ఇదివరకు నీకు వరము ఇవ్వలేదు. ఈమెకట్టుకొన్న వల్కలాలు ఇప్పుడే విడిచివేయవలెను. ఈమె తన పెనిమిటితో వనవాసము చేయడానికే నిశ్చయించుకొన్నట్లయితే సమస్త రత్నాభరణాలు పెట్టుకొని సుఖముగా పోవలెను.

ఓ కైకా, నాకు చావు దగ్గిరకు వచ్చింది. అందువల్లనే నీవు అడగగానే నీకోర్కెలు చెల్లిస్తాను అంటూ ఘోరముగా శపథము చేసినాను. నీవు నీబాలిశత్వమువల్ల రాముణ్ణి అడవులకు వెళ్లగొట్టమనీ భరతుడికి పట్టముకట్టమనీ కోరినావు. వెదురుకు వేసే పువ్వే వెదురును దహించివేస్తుంది. ఆవిధముగా నేను చేసిన శపథమే నన్ను దహించివేస్తున్నది.

ఓ పాపీ, ఒకవేళ రాముడు నిన్ను ఏకొంచెము అయినా కష్టపెట్టినాడేమో. ఈ వైదేహి నిన్ను ఏమి కష్టపెట్టింది. ఏమి అపచారము చేసింది. ఈ హరిణాక్షి ఈ ముద్దరాలు ఈ మృదుశీల ఈ పాతివ్రత్యతపోయుక్త ఈ జనకరాజపుత్రి ఇకముందు నీకు ఏమి అపకారము చేస్తుంది. ఓ పాపీ రాముణ్ణి అరణ్యవాసానికి పంపించే పాపము చాలదా. ఇంకా ఎందుకు పాతకాలకు ఒడిగట్టుతావు. నీకు ఏమిలాభము. ఓ కైకా తనకు యువరాజ్యాభిషేకము అవుతుంది అనుకొంటూ వచ్చిన రాముడికి నీవు చెప్పింది అంతా విన్నాను. నేను తల ఒగ్గినాను. నీవు ఇప్పుడు ఆ కోరికను అతిక్రమించి పోయినావు ఈ సీత కూడా నారచీరలు కట్టుకొని వనవాసానికి పోతూఉంటే చూడవలెను అని ఇప్పుడు నీకు బుద్ధిపుట్టింది. సీతచేత నారచీరలు కట్టించినావు. నీవు ఘోర నరకాన పడుతావు" అన్నాడు ఆ ధర్మాత్ముడు దశరథమహారాజు.

ఆయనకు ఏడ్పు వచ్చింది. కన్నీళ్లు కార్చినాడు. కైకేయీదేవి మనస్సు కరగలేదు. ఆయన దుఃఖానికి అంతము కనబడలేదు. నేలవంక చూస్తూ తలవంచుకొని కూర్చున్నాడు.

రాముడు ప్రయాణసన్నద్ధుడు అయి "దేవా, తాము పరమధార్మికులు. ఈ యశస్విని మా అమ్మ కౌసల్యాదేవి ఉత్తమశీల. వృద్ధ. నన్ను తాయ అడవులకు పొమ్మన్నా తమను ఈమె నిందించటములేదు. నేను వెళ్లిపోగానే ఈమె శోకసాగరములో పడుతుంది. ఇటువంటి దుఃఖము ఈమె ఇదివరకు ఎన్నడూ ఎరగదు. ఈమెను మీరు కనిపెట్టవలెను. కనికరించవలెను. ఈమె పుత్రశోకముతో కుంగిపోకుండా మీరు ఆదరించవలెను., నన్ను తలచుకొంటూ మీ ప్రాపున బ్రతుకుతుంది. నేను కనపడకపోతే ఈమె దుఃఖముతో కృశించి పోతుంది. ఈమె పుత్రప్రేమ అటువంటిది. నా కోసము ఈమె ప్రాణము విడువకుండా మీరు కాపాడవలెను. ఓ వరదా, తాము దేవేంద్రుడు అంతటివారు. కోరిన కోరికలు ఇసాదు. నాకు ఇంతకన్నా ఏకోరికాలేదు" అన్నాడు.

# భూమిశిస్తు పద్ధతులు

**శ్రీ కె. యం. ఉన్నితన్**
**రివెన్యూబోర్డు సభ్యుడు**

పురాతన కాలంనుంచి రాష్ట్ర ఆదాయంలో భూమిశిస్తు అతి ప్రధానమైంది. భూమిశిస్తులో వ్యవసాయానికి వినియోగించే నీటి తీరువ కూడా చేరి ఉంటుంది. ప్రస్తుతం భూమిశిస్తు పద్ధతికి బ్రిటిషు పాలనలోని రైత్వారీ సెటిల్‌మెంటుయే ప్రాతిపదిక. థామస్ మన్‌రో సెటిల్‌మెంటు విషయంలో ప్రముఖపాత్రను నిర్వర్తించారు.

మద్రాసు రాష్ట్రంలో కొన్ని ప్రాంతాలలో మన్రో రైత్వారీ సెటిల్‌మెంటు క్రింద నిర్ణయించేటప్పుడు శాశ్వత సెటిల్‌మెంటు కొరకు 1802 లో ప్రవేశ పెట్టబడింది. ఈ రెండు పద్ధతులే కాకుండా, మరో పద్ధతి 'గ్రామాలవారీ సెటిల్‌మెంటు' కూడా ఉండేది. కొంతకాలానికి దాని స్థానాన్ని 'రైత్వారీ సెటిల్‌మెంటు' ఆక్రమించింది. 'గ్రామాలవారీ సెటిల్‌మెంటు'లో గ్రామ ఉమ్మడిగా మూడేళ్లకు ఒక శిస్తు నిర్ణయించబడేది. 'రైత్వారీ' పద్ధతి మద్రాసురాష్ట్రంలో 1818 లో మొదటిసారి అమలు పర్చబడింది. రెవిన్యూబోర్డు స్టాండింగ్ ఉత్తర్వులతో పాటు, భూమిశిస్తు నిర్ణయానికి సాలీనా జమాబందీలు క్రమేపీ అమలులోకి వచ్చాయి.

హిందూ, ముసింరాజులు కొన్ని వృత్తులవారికి భూమి శిస్తు లేకుండా లేదా తక్కువ 'క్విట్ రెంట్లు' తో (ప్రధానంగా ధర్మాదాయ, దేవాదాయ సంస్థలకు) ఇవ్వటం ఆచారమయింది. అటువంటి భూములను ఈనాంలంటారు. బ్రిటిష్‌వారు కూడా ఈ పద్ధతిని అనుసరించారు.

రైత్వారీ, జమీందారీ, ఈనాంపద్ధతులలో 19 వ శతాబ్దంలో ప్రధాన సూత్రాలలో ఏమీ మార్పు జరగలేదు. 1908 లో మద్రాసు ఎస్టేట్ల భూమి చట్టం చేయబడింది. రైత్వారీపద్ధతిలో ప్రతి 30 ఏళ్ళకొకసారి రీ సెటిల్‌మెంటు చేసేపద్ధతికి 1937 లో ప్రజా మంత్రివర్గం స్వస్తిచెప్పింది. జమీందారీ రైతులకు 1948 మద్రాసు ఎస్టేట్ల రద్దుచట్టం, శిస్తుతగ్గింపుచట్టం (1947) వల్ల బాగా ప్రయోజనం కలిగింది. ఎస్టేట్ల రద్దు చట్టంతో జమీందారీ రైతులు ప్రభుత్వ రైతులుగా మారారు. దానితో ప్రభుత్వానికి భూమిశిస్తు ఆదాయం పెరిగింది. రాష్ట్రంలో 3000 ఎస్టేట్లకుపైగా రద్దుచేయబడ్డాయి. సుమారు ఒక 50 మాత్రం సివిల్ లావాదేవీలవల్ల మిగిలాయి. జమీందారీల సర్వే, సెటిల్‌మెంటు పూర్తిఅయి నప్పటికి ఆదాయంలో ఎంతఅభివృద్ధి ఉన్నదీ స్పష్టంగా తెలుస్తుంది.

ఈనాముల విషయంలో కొన్ని మద్రాసు ఎస్టేట్ల భూమి చట్ట సవరణతో ఎస్టేట్లుగా మారటం వాటికి శిస్తుతగ్గింపు చట్టం అమలుపర్చటం జరిగింది. ఈ చట్టం క్రిందకురాని ఈనాముల విషయంలో ప్రభుత్వం తగినచర్యలు తీసుకొనటానికి ప్రయత్నిస్తోంది.

ప్రస్తుత భూమి కొలు విధానాన్ని సమగ్రంగా పరిశీలించటానికి రాష్ట్ర ప్రభుత్వం ఒక భూమి సంస్కరణల సంఘాన్ని నియమించింది. 1949-50 లో అవిభక్త రాష్ట్రంలో మొత్తం 5,689 లక్షల ఆదాయంలో 812 లక్షల రూపాయలు భూమిశిస్తు ద్వారా వచ్చింది. ఆంధ్రరాష్ట్రంలో ప్రస్తుతం మొత్తం 2103 లక్షల రూపాయల ఆదాయంలో 478 లక్షలు భూమి శిస్తు ద్వారా లభిస్తుంది. క్షామం, వరదలు, తదితర పరిస్థితులు ఏర్పడినప్పుడు ఈ ఆదాయం తగ్గుతూ ఉంటుంది.

ప్రభుత్వ బంజరు భూములను భూములులేని బీదవారికి పంచటానికి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ కొత్త విధానాన్ని అమలుపర్చటంలో రివిన్యూ శాఖ నిమగ్నమైఉంది.

పశుపోషణ యీరాష్ట్రంలోని ముఖ్యమైన పరిశ్రమలలో ఒకటి. ఎందుకనగా యీరాష్ట్రంలో మొత్తం పశువులసంఖ్య దేశం మొత్తంపై పశుసంఖ్యలో 1/8 వ వంతు అయివున్నది. రాష్ట్రం అవతరించడంతో పశుపోషణలో అనేక చిక్కులు, సమస్యలు పుదయించినవి. అయినా పశుపోషణ వాటికి వైద్య చికిత్స మున్నగు తల్సంబంధమైన రంగాల్లో అనేక కార్యక్రమాలను ప్రభుత్వం ప్రారంభించింది.

ప్రఖ్యాతి పుంగనూరు పశు సంతతి పునరుద్ధరించబడినది. ఇచట ఆవులు చాలా చిన్నవి అయినా పాలు చాలా ఎక్కువ యివ్వగలవు. ఈ సంతతి పునరుద్ధరణకు ఒక కేంద్రాన్ని కూడా నెలకొల్పుటకు ప్రభుత్వం మంజూరు చేసింది. గుంటూరు, గోదావరి జిల్లాలనుంచి యీ సంతతికి చెందిన వివరాలు సేకరించబడుతున్నవి. కలీ పశువుల సంతతిని పశుసంపర్కానికి మాత్రం వినియోగించాలని కూడా వుద్దేశించబడింది.

రాయలసీమ అవసరాలకుగాను ఒక పశు పోషణ కేంద్రం స్థాపించుటకు ప్రభుత్వం అనుమతించింది. ఒంగోలు పశువులను, దూడాషి పశు సంతతిని వుంచడానికి వుద్దేశించబడింది. ఈ కేంద్రంలో అప్పుడే పని ప్రారంభమైంది. మహానందివద్ద మరో కేంద్రం నెలకొల్పుటకు తగినభూములు ప్రభుత్వ అధీనంలో సిద్ధంగా వున్నవి.

## కేంద్రాల పునరుద్ధరణ

పై రెండుగాక, ప్రస్తుతం విశాఖ జిల్లా హనుమంతవాకలో వున్న పాడి కేంద్రం (ఆబోతులకూడ ఇచట కలవు) గుంటూరుజిల్లాలోని 'లాం' కేంద్రం గాడా అభివృద్ధిపరచబడెను. ఒంగోలు జాతిసంతతిని చింతలదీవివద్ద కేంద్రీకరించటానికి 'లాం' కేంద్రాన్ని గుంటూరు ప్రజలకు పాలసరఫరాకుగాను పూర్తిగా బర్రెలు వుంచే కేంద్రంగా మార్చుటకు ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ఒంగోలు జాతిపశువులు కలవారందరు ఒక సంఘంగా ఏర్పడాలనిసూచించాం. ఇదేర్పాటైనది మార్కెటింగ్ సౌకర్యాలు ఇచట తేలికగా అందుబాటులో వుంటాయి.

## ఆబోతుల పంపకం

వివిధజాతులకు చెందిన ఆబోతులను ఆయా ప్రాంతాలకు తగినవిధంగా పంపకంచేసేస్కీము తిరిగి తలపెట్టాం. ఉమ్మడి రాష్ట్రంలో దీని విషయం వాయిదా వేశారు.

## కోళ్లు

ఆంధ్రలో వున్న కోళ్ళ సంఖ్య 7872251 అని అంచనా వేశారు. దీనికి సంబంధించిన సమస్యలనుగూర్చికూడ పశుపోషణశాఖ ఆలోచిస్తున్నది. కడప, చిత్తూరు, లాం, విశాఖలలోని కోళ్లకేంద్రాలు పునరుద్ధరించబడినవి. కోళ్లు, గుడ్లు, ఎక్కువగావడానికి అవసరమైన కృషి అంతా యీ కేంద్రాలలో జరుగుతున్నది.

విశాఖలో వున్న కేంద్రంలో ఒకేసారి 1400 గుడ్లనుతీయడానికి వీలుగా ఒక యంత్రం నెలకొల్పబడింది. ఆలూరు, గోపన్నపాలెంలలోని కోళ్ళ వుత్పత్తి కేంద్రాలు సంతృప్తికరంగా పనిచేస్తున్నవి.

## గొర్రెలు, మేకలు

మాంసాహారం క్రింద నెల్లూరుజాతి గొర్రెలు ఉన్నికి బళ్లారిజాతి గొర్రెలు వున్నవి, కాని బళ్లారి ఆంధ్రకులభించ



కృష్ణాజిల్లా కంకిపాడులో పశ్చిమ కృష్ణాజిల్లా హరిజన హైస్కూలు, హరిజన విద్యార్థిగృహం సెప్టెంబర్ ... వ తేదీన రెవెన్యూమంత్రి శ్రీ కోటిరెడ్డిగారు ప్రారంభించారు. కాకాని వెంకటరత్నం, అధ్యక్షులు అప్పికట్ల జోసెఫ్ గారలు కూడా వున్నారు.

దివి సీమయైన భావదేవరపల్లిలో రెవెన్యూమంత్రి శ్రీ కోటిరెడ్డిగారు సెప్టెంబరు 22 వ తేదీన బంజరు భూములకు పట్టాలు బీదలకు యిచ్చినప్పటి దృశ్యం. ఆంధ్రప్రదేశ్ రైతుకాంగ్రెసు ఆర్గనైజింగ్ కార్యదర్శి మండలి వెంకటకృష్ణారావుగారు కూడా వున్నారు.

# పశుపోషణ

**మేజరు శ్రీ టి. మురారి**
**[పశుపోషణశాఖా డైరెక్టర్]**

వలసిన స్థానికంగా వుండే గొర్రెల నుంచి ఉన్నిని అభివృద్ధి చేయుట ముఖ్యం. అందుకనే నీలగిరిజాతి గొర్రెలను అనంతపురం జిల్లాలో పంపకం చేయడం జరిగింది. మాంసాహారానికి పనికివచ్చే గొర్రెలను అభివృద్ధిచేసే స్కీము కృష్ణాజిల్లాలో సంతృప్తికరంగా అమలుజరుగుచున్నది. ఏజన్సీ అభివృద్ధి స్కీముక్రింద చింతపల్లిలో నెలకొల్పనున్న కేంద్రంలో మేలురకం గొర్రెలను, మేకలను తెచ్చి వుంచాలని ప్రభుత్వం వుద్దేశిస్తున్నది.

నిడుబ్రోలు, అమ్మనబ్రోలువద్ద రెండు ముఖ్య గ్రామకేంద్రాలు వున్నవి. ఇచట పని క్రమేపీ ఎక్కువవుచున్నది. ఇంకొ 4 కేంద్రాలు తెరవాలనే సూచనగూర్చి భారతీయ వ్యవసాయ పరిశోధనాసంఘం, రాష్ట్రప్రభుత్వం పరిశీలిస్తున్నాయి. రైతులు కృత్రిమ పశుసంపర్కం గూర్చిన ప్రయోజనాలను తెలుసుకుంటున్నారు. మిశ్రమజాతి పశువుల ఉత్పత్తికి జెర్సీ ఆబోతుల సహాయంతో ఒక స్కీమును అమలుజరపడానికి భారతీయ వ్యవసాయ పరిశోధనాసంఘంవారు డబ్బు యిచ్చేందుకు అనుమతించారు. విశాఖలో త్వరలో యీ స్కీము అమలు జరుగుతుంది.

## పశుగణాభివృద్ధి

గొర్రెలు, ఆవులు, మేకలు కోళ్లు మున్నగు వివిధరకాల పశువులు, జంతువులు గల ఒక కేంద్రాన్ని నెలకొల్పాలని ప్రభుత్వంఆలోచిస్తున్నది. కొండజాతుల అభివృద్ధికి దశవర్ష ప్రణాళిక క్రింద ఏజెన్సీప్రాంతాల్లో పశుగణాభివృద్ధి అవసరమని సూచించబడింది. ఆబోతులు, గొర్రెలు పంపిణీ చేయబడినవి ఫలితాలు చూడవలసి వున్నది.

## వ్యాధిని అదుపులో వుంచడానికి మార్గాలు

పశువుల ఆరోగ్యం విషయమై ఈ శాఖ చాలా అభివృద్ధి చూపించింది. 'తెగులు' నిర్మూలనానికి ఒక వుద్యమం ప్రారంభించింది.

కృష్ణానదికి దక్షిణంగా వున్న అరు జిల్లాలను పైలట్ ప్రాజెక్టులో చేర్చడానికి కేంద్ర తెగులు నివారణ కమిటీ ఆమోదించింది. త్వరలో యీస్కీము ప్రారంభింపబడగలదు.

ఐదు పశువైద్యశాలలు ఐదుసంచార పశువైద్యదళాలు ఏర్పరచడానికి ప్రభుత్వం మంజూరు చేసింది. వివిధరకాల వ్యాధుల వివరాలను వుద్యోగులు సేకరిస్తున్నారు, కాని తగిన లేబరేటరీ వుండాలని కోరినందున ప్రభుత్వం ఆ విషయమై పరిశీలిస్తోంది.

## పశువైద్య విద్యావిధానం

వెటర్నరీ విద్యలో వివిధ తరగతులకు చెందిన సిబ్బంది ఎనకు శిక్షణ విచారకరం అటువంటి శిక్షణ యిచ్చే కళాశాలగాని సంస్థగాని లేదు. అయినా విశాఖలో వెటర్నరీ, లైవ్ స్టాక్ ఇన్‌స్పెక్టర్ల కోర్సు నెలకొల్పుటకు ప్రభుత్వం అంగీకరించినట్లు తెలుస్తున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వెటర్నరీవిద్యలో డిగ్రీకోర్సుకు సన్నాహాలు జరుగుతున్నాయి.

సమాజవికాస కేంద్రప్రాంతాలలో కీవ్ గ్రామస్కీము ప్రవేశపెట్టారు. సామర్లకోట గ్రామసేవకుల వాఖశాలలో ఆధునిక పరికరాలన్నీ వుంచవలసినదిగా కోరాము.

## సమాచార సంస్థ

పశువులకు చెందిన సమాచారం వాటికి సంబంధించిన పరిశ్రమల వివరాలు తెలియజేసే ఒక సమాచారసంస్థ నెలకొల్పాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది. వ్యవసాయ, పశువర్ధక, అటవీ మత్స్యశాఖల కృషి సమన్వయం చేసేందుకు మంత్రి శ్రీ తిమ్మారెడ్డిగారు యిటీవల సమావేశం జరిపారు. దీనికి చాలా ప్రముఖ్యత కలదు.

# సమాజవికాస ప్రణాళికల సర్వతోముఖ వ్యాప్తి

**[డాక్టరు బి. నటరాజన్]**
**డెవలప్మెంట్ కమిషనర్**

ఆంధ్రరాష్ట్రం రెండు కమ్యూనిటీ ప్రాజెక్టులతో ఆరంభమైంది. ఒకటి కడప-కర్నూలు ప్రాంతంలో, ఇంకొకటి కాకినాడ - సామర్లకోట ప్రాంతంలో. దరిమిలాను శ్రీకాకుళం జిల్లాలో ఇచ్ఛాపురం తాలూకాకు ఒకటి, చిత్తూరుజిల్లాలో వాయల్పాడు తాలూకాకు ఒకటికలిపి రెండుకమ్యూనిటీ డెవలప్మెంటుబ్లాకులు వెలిశాయి. రాష్ట్రంలో 11 జిల్లాలమీదాకలిపి 22 జాతీయవిస్తరణ సర్వీసు బ్లాకులుకూడ ఏర్పడ్డాయి. త్వరలోనే ఇటువంటివి మరికొన్ని కూడ ఏర్పడనున్నాయి. కమ్యూనిటీప్రాజెక్టులకు మూడు సంవత్సరాలకు అంచనా వేసిన ఖర్చు రూ. 15 లక్షలు. కమ్యూనిటీ డెవలప్మెంటు బ్లాకులకు మూడు సంవత్సరాలకు రూ. 60 లక్షలు. జాతీయవిస్తరణ బ్లాకులకు మూడు సంవత్సరాలపైన తలా 7½ లక్షలు.

ప్రజల జీవిత దృక్పథంలో అభ్యుదయదృష్టి తీసుకురావడమూ, సమాజాభివృద్ధి కార్యాలలో ప్రజలు స్వయం సహాయానికి పూనుకొనేటట్లు చేయగలగడమూ, వ్యవసాయవిధానంలో శాస్త్రీయ పద్ధతులు ప్రవేశపెట్టి వ్యవసాయోత్పత్తిని పెంచడమూ, గ్రామపరిశ్రమలను ఉద్ధరించడమూ, పల్లెసీమలలో ఉద్యోగవృత్తులుకల్పించి నిరుద్యోగాన్ని నివారించడమూ ఈ వివిధ సమాజవికాస కార్యక్రమాల ముఖ్యలక్ష్యాలు.

గ్రామీణప్రజలకు ఈ కార్యక్రమంపై శ్రద్ధ కల్పించడానికి శిక్షణ పొందిన సిబ్బంది యథాశక్తి సహకరిస్తున్నారు. వీటిపై ప్రజలకు శ్రద్ధ పుట్టుకొనివస్తున్నది. స్వయంగా ముందుకువచ్చి వీటినిర్వహణకై వస్తున్నారు. కాయకష్టం పడగలవారు కాయకష్టం చేసి సమాజాభివృద్ధికి తోడ్పడుతున్నారు. డబ్బుసహాయం చేయగలవారు డబ్బుసహాయమూ, పదార్థరూపంగా సాయం చేయగలవారు పదార్థసహాయమూ చేస్తున్నారు.

పల్లెసీమల్లో చదువుసంస్థలు లేనివానికి చదువుసంస్థలు సమకూర్చిపెట్టడం కూడా ఈ కార్యక్రమాల్లో ఉన్నది. ముఖ్యంగా వయోజనవిద్య ప్రాధాన్యం వహిస్తున్నది.

దేశసౌభాగ్య మూలకందాల్లో ఒకటైన పశుసంతతి అభివృద్ధికికూడ ఇందులో ప్రముఖస్థానం ఇచ్చారు. నీరసిల్లిపోయి, నిష్ప్రయోజనంగా ఉంటున్న పశుసంతతిపోషణకూ, జాతిపశువుల అభివృద్ధికీ చాలా పాటుపడుతున్నారు.

మూడుముక్కల్లో చెప్పవలసివస్తే, ఈ సమాజ విస్తరణ సర్వీసు సర్వతోముఖమయింది; సర్వాత్మకమయింది; బహుళ ప్రయోజనకరమయిందీని. గ్రామీణ జీవితంలో సాంఘికంగా, నైతికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా అభివృద్ధిసాధించడమే ఈ కార్యక్రమాల పరమార్థం. అయితే, ఒక్క రాజకీయాలకుమాత్రం ఇందులోస్థానం లేదు. ప్రజలు ఎవరి కిష్టంవచ్చిన రాజకీయాలను వారు అనుసరించవచ్చు. రాజకీయాలతో ప్రమేయం లేకుండా గ్రామీణ జనసామాన్యాన్ని జాతినిర్మాణ కార్యక్రమాలకూ, సమాజవికాస కార్యకలాపాలకూ సంఘటితపరచడమే ఈ ప్రణాళిక నిర్వాహకుల ఆశయం.

ఈ యేడాది జరిగిన కార్యక్రమాలలో పురోగమనం బాగానే కనబడుతున్నది. సహకారోద్యమం సర్వవిధాలా విస్తరిల్లిపోతున్నది. ఈ ప్రణాళికలక్రింద చాలా పనులు జరిగాయి. చాలా చెరువులకు మరామత్తులు జరిగాయి. కొత్తగోతులు వేశారు. 40 దాకా వయోజన విద్యాకేంద్రాలు ఏర్పడ్డాయి. గోటుపరుపాలు వెలిశాయి. వ్యవసాయదారులకు విరివిగా రసాయన ఎరువులూ, విత్తనాలూపంచిపెట్టబడినాయి. పశుసంతతి అభివృద్ధికి 8 కేంద్రాలు ఏర్పాటుచేశారు.

మొదటిసారిగా రాష్ట్రంలో సాకార్యక్రమాలు అనుకున్నదానికంటె వేగంగా సాగిపోతున్నాయి.

# గాంధియుగం సమీక్ష

(5 వ పేజీ తరువాయి)

ఇవల పత్రికాముఖులు ప్రాయోపవేశములు హాస్యాస్పదముగ తయారైవవి.

గాంధీజీ కేవలము జాతికితగ పరిగణించుట ఆయన విలువను పూర్తిగ గ్రహించుట కానేరదు. ఈయనమానవ జాతి అంతకు పూజ్యులు. బుద్ధ క్రీస్తుల స్థాయికి చెందిన వ్యక్తి. మానవజాతి యొక్క భవితవ్యాన్ని తీర్చిదిద్దిన యుగపురుషులలో ఒకడు. ప్రపంచ చరిత్రలో కీర్తివిస్థానము. కేవలము మాటల వల్లనే కాక మహాత్వమువలన, త్యాగమువలన, వున్నతస్థాయికి రగలవని నిరూపించిరి. నిరాడంబరమగు పవిత్ర జీవితము దయా, సత్య, శౌచముల ప్రకృతి హింస, అసత్యము, స్వార్థము ప్రబలుచుండును. గ్రీకులు సోక్రటీసు వంటి మహావేదాంతికి విషము పెట చంపిరి. యూదులు ఏసును సిలువ వేసిరి. క్రైస్తవ మతస్థుల మధ్య జరిగిన పోరాటములో ఒకరినొకరు క్రూరముగ కాల్చిరి. చివరకు గాంధీజీ మహాత్ముడు ఒక హిందువుతో హత్యకు గురి అయెను. భగవద్గీతలో చెప్పినట్లు దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుటకు జన్మించెను. మహాపురుషుల శ్రేణికి చెందిన వ్యక్తి గాంధి అనుట అతిశయోక్తి కాదు. 98 పౌనులు బరువుగల సన్నటి వ్యక్తి కొల్లాయికట్టి హృదయమందు ప్రేమను, పెదవుల మీద చిరునవ్వును కలిగి రామనామ స్మరణ చేయుచు ప్రాణము విడిచి చరితార్థుడయ్యెను. ఆయన పరమపదించినను ఆయన తత్వము నిల్చియున్నది. ప్రపంచ పరిణామములో గాంధియుగము ఫైల్యము, ప్రశాంతిమయమగు గాంధీజీయొక్క తత్వము యథార్థముగ వర్ధిల్లనో లేక నామమాత్రముగ నిల్చియుండునో భవిష్యత్తు మాత్రమే నిరూపింపగలదు.

